ఆత్మదర్శనము; శిల్పదర్శనము; సాహిత్యదర్శనము; అమరావతి; తోరణము; మూడుకావ్య; సిద్ధప్పజీశ; విశ్వకర్మాష్టక; నిరంజనవిజయ; ఆశియాజ్యోతులాది బహు గ్రంథకర్తలును దర్శనాచార్య, బిరుద విభ్రాజితులును, వి. యస్. ఆర్. కాలేజీపండితులును నగు పండిత : బ్రహ్మశ్రీ కొండూరు వీరరాఘవాచార్యులవారి అభిప్రాయము.

దేశభక్త శ్రీ వోలేటి సుబ్రహ్మణ్యశర్మగారు రచించిన "శ్రీ పెదకాకాని మల్లేశ్వరక్షేత్ర మహాత్మ్యము"ను స్థాలీపులాకన్యాయమున బరికించితిని. వీరీ గ్రంథరచన కెంతయో పరిశ్రమించినట్లు గ్రంథమునందుదాహరించిన చరిత్రాంశములు, శాసనములు పురాణాంశము మున్నగు ప్రమాణములుగ్గడించునవి.

కాకానిక్షేత్రము మహామహిమాస్పదమునటకు కావలసినంత ఆధునిక ప్రజాసాక్ష్యముండుట; దానికిం దగు ప్రాచీన మహిమ, శాసన, చరిత్రాదులు సమానముగ నిరూపించుచు నీగ్రంథము భక్తకోటికి మహోపకారమొనర్చుచున్నది.

శ్రీ శర్మగారీ విషయ బహుళమగు గ్రంథరచనమూలమున భక్తసమాజమునకు ఎనలేనిసేవయొనర్చినారనుట అతిశయోక్తి కాదు. ప్రతియాత్రికుడు ఈగ్రంథమును పఠించి శివకైంకర్యమొనర్చి ధన్యుడు కావలయునని యాశించు-

తెనాలి
29-10-1960

సుధీవిధేయుడు,
కొండూరు వీరరాఘవాచార్యులు.
(వి. యస్. ఆర్. కాలేజీపండితుడు)

శ్రీ పెదకాకాని

# మల్లేశ్వరక్షేత్రమాహాత్మ్యము

(స్థలపురాణము)




* రచయిత *

## దేశభక్త: వోలేటి సుబ్రహ్మణ్యశర్మ

దేశహితప్రదీపిక, విజయధ్వజి, శ్రీ మల్లేశ్వర ప్రభాత స్తోత్రాది బహు గ్రంథకర్త.)

**1960**

సర్వస్వామ్య సంకలితము

ప్రథమకూర్పు 1000 ప్రతులు.
56 పుటల వరకు జయలక్ష్మీ ప్రెస్సు మిగత
విజయలక్ష్మీ పవర్ ప్రెస్సు, గుంటూరు-1

మూల్యము
ప్రతి 75 న.పై

# పరిచయము

మిత్రులు శ్రీ దేశభక్త నోలేటి సుబ్రహ్మణ్యశర్మగారు నిరాడంబరులు, సాధుశీలురు, పరిశీలనావ్రతులు, "దేశహిత ప్రదీపి" కాది రచయిత. దేశాభిమానం గుత్తగొన్నట్లుండదయాలు వారి దేశభక్తి మాదిరిగా గాక యశశ్రీ కలితమైన దేశభక్తి నిండారిన సహృదయంతో ధ్యానస్థాయికి మలుపు కొన్న శిష్టుడు.

సజ్జనుడు కావటంచేత, ఆడంబరం లేనివాడు కావటం చేత పైకి రాదగినంత పైకి రాలేకపోయినాడు. వారు ఆస్తికులైనా, నేను ఆస్తికుణ్ణికాకపోయినా వారి సౌజన్యకృషి మాబోటి వారిలో సయితం ఆర్ద్రితను కలిగించినది.

వారికృషిలో చారిత్రక, సాహిత్య, సాంఘిక, పౌరాణిక పరిశీలనలుంటవి. అందువల్ల వారి నిర్ణయాలు అన్నీ మనం అంగీకరించినా, లేకపోయినా వారి విశాలదృష్టి, దృక్పథంగమనార్హము, అనుకరణీయము.

శ్రీ శర్మగారి నేటి కృషికింకను ప్రోత్సాహం అవసరం; సంస్థలు, వ్యక్తులు యీ విషయిక కృషిలో వదాన్యత చూపుచూ వారి యీపవిత్రకృషిని వెలార్చ వలసివున్నది దానికి మిత్రకోటి పూనికవహించి కృషి సల్పవలసివున్నది.

తెనాలి } ఆవుల గోపాలకృష్ణమూర్తి M.A.LL.B.
29-11-60 } అడ్వొకేటు

# ఫలశ్రుతి - కృతజ్ఞత

శ్రీ మల్లేశ్వర క్షేత్రమాహాత్మ్య ఫలశ్రుతిం గూర్చి ఆంధ్రప్రదేశ దేవాదాయ ధర్మాదాయ శాఖ కమీషనరు శ్రీ పైడి లక్ష్మయ్యచౌదరి బి. ఎ. బి యల్. గారికి సమర్పించిన కృతజ్ఞతా యుత పద్యప్రసూనములు

౧. శ్రీ పైడి లక్ష్మయాహ్వయ,
ప్రాపిత కాకాని తీర్థ భగవత్కరుణా, దీపిత సజ్జనహృదయా!
మాపుణ్యఫలప్రదాన మహనీయ. జయా!

౨. పైడికిఁదావియబ్బినటు భవ్యభవన్మహనీయ విద్యకుం.
దోడయి వన్నెకెక్కెడిని దొడ్డ గుణంబులవారిగాఁగ మీ,
కీడు జగానఁ గాన జగదీశ్వరు సత్కృప పెన్నిధానమై,
వీడక మీకొసంగెఁ బదవిన్ మతసంస్థల నుద్ధరింపఁగన్.

౩. శ్రీశైల మల్లికార్జున,
నీశాను కృపాకటాక్ష మెంతేఁగని మల్లేశుని కాకానీశ్వరు,
పాశుపతాస్త్రప్రదాన పరు హరుఁ గొలువన్.

౪. ఆస్తిక్యంబు ప్రబోధమున్నలిపి యాత్మానందముంగూర్చి లో,
కస్తుత్యర్హ పదంబు నన్నిలిచి విజ్ఞానస్వరూపుండవై,
యస్తోకప్రతిభన్వెలింగెదవు లక్ష్మయ్యా! బుధాగ్రేసరా!
స్వస్తిశ్రీ విజయాయు రభ్యుదయ సంప్రాప్త్యస్తు నిస్తుల్యతన్.

౫. ఆద్యంతము తిరుపతి వలె
మోదము ధర్మార్థకామ మోక్షప్రద గౌ
రీదయితు నిలయమహిమన్
శ్రీ దెల్పు మదీయసుకృతి శ్రేయముఁగూర్చున్.

శ్రీ శ్రీ మల్లేశ్వరాలయ మేనేజింగుట్రస్టీ శ్రీ చేబ్రోలు రామస్వామి చౌదరిగారు సహాయమొనర్చుచూ శాశ్వతముగ నీ గ్రంథ ప్రచురణాధికారమును కమిటీ కిచ్చినియు, ప్రతి ఫలము సన్మానము నుంగూర్చి తగు వాగ్దత్త మొనర్చుటచే యథావిధి నాయీ గ్రంథ ప్రచురణాధికార హక్కు నట్టి శ్రీ వారి దేవస్థాన కమిటీకి కృతజ్ఞతతో నిడితిని. దీని న్వెంట వెంటనే ప్రచురించు చుండవలెను. ఇట్లు గ్రంథకర్త.

'కాకా నీశాలయందృష్ట్వా, కైవల్యంప్రాప్యతేధ్రువమ్'



శ్రీ మల్లేశ్వరాలయ మేనేజింగు ట్రస్టీ శ్రీ చేబ్రోలురామస్వామిచౌదరిగారు.





'పాతూరి' హారపరాంచిత
పూతక్షేత్రంపు మహిమ
బుధజన చేతః,
ప్రీతికరంబుగఁ గరముల
నేతద్విశ్వమున వెలయ
నింపుగదేశా !

శ్రీ విఘ్నేశ్వరదేవా !
[illegible]విన్ జయములను
గూర్పు, బహుళంగులనే,
సేవింతు నెల్లవేళల
గావింపుము శుభసమృద్ధి
గణనాధప్రభూ !



రజిత కవచాలంకృత
శ్రీ విఘ్నేశాయనమః

---



శ్రీ శ్రీ శ్రీ చేబ్రోలు రామస్వామి చౌదరిగారు
శ్రీ మల్లేశ్వర దేవస్థాన మేనేజింగుట్రస్టీ & బెంచిమేజిస్ట్రేట్
(తక్కెళ్లపాడు; సాంబశివపేట - గుంటూరు.)

## ఆనుబంధము

పూర్వము శ్రీకృష్ణదేవరాయ లిటకు (క్రీ. శ. 1518 ప్రాంతము) రాకముందే మల్లేశ్వర మూలవిరాట్టు గలచోట నొక మహాభక్తుని సమాధి గలదనియు, ఆ భక్తుడు శివభక్తాగ్రేసరుండగుటచే నా సమాధిని శివస్వరూపముగా బూజింపబడుచుండెననియు. కైలాసవాసియైన పరమశివుడు శ్రీశైల నివాసియయ్యు భక్తజన సంరక్షణార్థం భ్రమరాంబా సహితముగ గగనవీధిని బయనించుచు నీ భక్తశేఖరుని సమాధి తన పేరఁ బూజించఁబడుటఁగాంచి యిదియు నా నివాసస్థలమే యగుగాక యని తలంచి దివినుండి భువికి విచ్చేసి మల్లేశ్వర నామమున వెలసినట్లు ప్రతీతిగలదు. కావున ఆ శివభక్తాగ్రేసరుఁగూర్చి యీ గ్రంథాద్యంతములందుఁ బ్రచురింపఁబడియె.



శ్రీ పెదకాకాని మల్లేశ్వరాలయ సంపూర్ణ దృశ్యము

N.B:- ఆర్కియాలజికల్ నెం. 251. of 1892 రిపోర్టు కాకాని శాసనము Vol. iv లలో శ్రీకృష్ణదేవరాయ లొసంగియున్నట్లు గల భూఖండమును గూర్చినంతవరకు నీ గ్రంథాంతమున 106 పుటలోఁ బ్రచురింపనయ్యెను తక్కిన దందుకు సంబంధింపకున్నను అవసరమగుచో రెండవ కూర్పునందు బ్రచురింపవచ్చును.

## శ్రీ విఘ్నేశ్వరాయనమః



రజిత కవచాలంకృత విఘ్నేశ్వరస్వామి

పాపహారి హార వర్ధాంచిత పూతక్షేత్రంపు మహిని

బుధజన చేత

స్తుతికరంబుగఁ గుడుములనేత ద్విశ్వమున వెలయఁ నింపుగ నేశా

శ్రీభద్రకాళీ, వీరభద్రస్వామి.　　　　శ్రీ త్రిపురాంబా, మల్లేశ్వరస్వామి.



సర్వాలంకార శోభిత, పూజా పురస్కారయుత మూల విరాట్స్వరూపం. (గర్భగుడులందలి వరుసక్రమము)

ఓం నమశ్శివాయ

# శ్రీ పెదకాకాని

# మల్లేశ్వర క్షేత్ర మాహాత్మ్యము

(స్థల పురాణము)

శ్లో॥ కాకానినాథ కరుణారసపూర్ణసింధో,
భక్తార్తిభంజన నిరంజనదీనబంధో,
దేవేంద్రవహాళి మణిమండితపాదయుగ్మ,
శ్రీ మల్లికేశ్వర పరాత్పరవై నమస్తే.

శ్రీమద్ధరావలయ విలసితంబైన హైందవదేశం బత్యంత పుణ్యక్షేత్రంబులకిరవై పెక్కువిధానంబుల్లు మహోన్నతి నంద గల్గుచున్నయది అందునూ శివక్షేత్రంబు లసంఖ్యాకంబులై మానవలోకంబున కిహపర సుగతుల కాకరంబై వెల్లివిరియుట మిక్కిలి ప్రశంసనీయము.

శ్రీ రామచంద్ర సార్వభౌముఁడు ఆర్య ధర్మోద్ధరణకై శంబుక, కాకాసురాదులను ఖండించి, దశముఖబ్రహ్మను బరిమార్చి ఆ బ్రహ్మహత్యా మహాపాతకంబు బోవ శివపూజ గావించుచు లింగేశ్వరప్రతిష్ఠ గావించి తరించుట గల్గినది. ఆ రామభద్రుఁడు ప్రతిష్ఠించియున్న శివలింగమునకు "రామేశ్వర లింగ"మని పేరుగల్గినది ఆ దివ్యస్థలము మహా పుణ్యక్షేత్రమై రానురాను "రామేశ్వర" మను మహా పట్టణముగ ప్రవర్థమానంబయ్యెను. అట్టే దినదినాభ్యున్నతినందుచు నిత్యకళ్యాణ పచ్చతోరణంబుల నెనలేని దివ్యమహిమలచే ననేక రీతుల పెచ్చుపెరిగియున్న పెదకాకాని శ్రీ మల్లేశ్వరస్వామి క్షేత్ర మాహాత్మ్య రచనము నా గావున్చు బహుకాల సేవాఫలితముగ నుత్తీర్ణమైనందుకు సంతసించుచు, స్వామియందు భక్తి; భావమం దనురక్తిగల మహాశయులెల్లరు పరిగ్రహింపగలరని విశ్వసించుచు సర్వశైవ పురాణప్రశస్తంబుగ నీ సవిస్థర స్థల పురాణ క్రమం బెఱింగించు చున్నాను.

## మల్లేశ్వరాఖ్య - స్కాందపురాణం

కాకానీశ్వరుఁడైన సదాశివునకు మల్లేశ్వరనామ మెప్పటి నుండి కలిగినదన్నీ విచారించు చో స్కాంద పురాణాంతర్గత కథనం బెఱుంగవలెను. అందలి యీ క్రింది శ్లోకంబులను పఠింతురుగాక.

శ్లో॥ జ్యోతిర్లింగ స్వరూపేణ జపౌ సర్వేశ్వరశ్శివః ।
తథా తం పూజయామాస దేవ మల్లీ కదంబకైః ॥
దర్శనం బ్రహ్మణేదత్వా బ్రహ్మలోకం దదౌశివః ।
తదాప్రభృతి దేవేశం మల్లికేశం వదంతిహి॥ (స్కా॥పు॥)

పూర్వము బ్రహ్మదేవుఁడు ఉన్నతపదంబర్థించి జ్యోతిర్లింగ స్వరూపుఁడైన పరమశివుని మల్లీకదంబకపుష్పములచే పూజించుచు జపించెను. అప్పుడు యీశ్వరుండు ప్రత్యక్షుఁడై బ్రహ్మకు బ్రహ్మలోకాధిపత్యం బొసంగెను. అదిమొదలు పరమేష్ఠి శివప్రీతికరంబని యెంచి మల్లీకదంబక పుష్పములచేతనే పూజించుచు శివునకు "మల్లేశ్వరుండ"ను నుపాఖ్య గల్గించెను. కావుననే శ్రీశైలమున "మల్లికార్జునుండ"ని కాకానిని "మల్లికార్జున" "మల్లేశ్వర" నామములతోడను కైలాసవాసియైన సదాశివుండు వెలసియుంట గల్గినది. తక్కుంగల ప్రదేశములందలి మల్లేశ్వర నామ మూర్తుల సందర్భమునంగూడ నిదేవిధంబని ఎఱుంగనగును.

# పద్మపురాణాంతర్గత మల్లేశ్వరస్తోత్రము

పూర్వకృత పాపకృత్య పరిపాకంబునంజేసి పిశాచత్వము నొందిన ఒక పాఱుఁడు మల్లేశ్వరుని స్తోత్రించి కృతార్థుండైనందున నా స్తోత్రశ్లోకంబులు "పద్మపురాణంబు" నుండి యిట పాఠకుల ఉపయోగార్థ ముదాహరించుచున్నాను.

శ్లో॥ ఏవంతు ప్రార్థయామాస శివంపన్నగభూషణమ్।
నమస్తే పార్వతీనాథ! నమస్తే విశ్వమంగళ ॥ ౪౨

నమఃపరమకళ్యాణ నమస్తే సర్వపూజిత ।
అవిద్యాం దర్పణీకృత్య తేజస్వీ ప్రతిబింబితాత్ ॥ ౪౩

జీవత్వమీశ్వరోబింబో మల్లికేశ మహాప్రభో!
బ్రహ్మవిష్ణ్వీశరూపేణ సృజస్యవసిహంసిచ. ౪౪

పరంబ్రహ్మ పరంధామ పరమో నిరుపద్రవః
త్వమేవ శుద్ధచైతన్యం ద్వైతాంజన వివర్జితమ్. ౪౫

శుద్ధంబుద్ధం ప్రముక్తంచ స్వరూపం తే మహేశ్వర!
మాయయాఽపహృతజ్ఞానాః నజానంతిబుధా అపి॥ ౪౬

బ్రహ్మాదయస్సురాస్సర్వే తవ్మాయాపరమోహితాః
సర్వజ్ఞం మన్యమానాస్తే కించిజ్ఞా అపిశంకరమ్॥ ౪౭

తవరూపంనజానంతి కింపునర్మానృశాః ప్రజాః". (ప॥పు॥)

నాకీ పిశాచత్వముం బాపుమో పరమశివా! పన్నగభూషణా! పార్వతీపతీ! పతిత పావనా విశ్వమంగళ మూర్తీ! నీకు నా నమోవాకములు. పరమకారుణ్యా! నీకు నా జేజేలు. దేవ వందితా! నమస్కారములు. మానవతేజమందలి అవిద్యా ప్రతి

బింబమునకు నిర్మల దర్పణరూపమును దాల్చిన మహాదేవా! వందనములు. తమకు జీవత్వమనునది యీశ్వరబింబముగదా! అట్టి యీశ్వర దివ్యాకృతిని మహేశా! మహాప్రభో! బ్రహ్మ విష్ణు, ఈశ్వర స్వరూపములతో సృష్టి, రక్షణ, సంహారక్రియలను జేయుచున్నాడవు సుమా! నీవు పరబ్రహ్మవు, పరంధాముడవు, పరముడవు నిరుపద్రువుడవు. నీవే శుద్ధచైతన్యమవు, నీవు ద్వైతభావరహితుడవు, శుద్ధుడవు, బుద్ధుడవు, ముక్తుడవైయుంటివి. ఇట్టి నీ రమణీయ స్వరూపములోని యాంతర్యము నో మహేశా! గుఱుతించలేనైతిని. పొరపాటు బడుచున్నాను. అవిద్యా బలమువలన సత్యజ్ఞానమంతయు సన్నగిలినది. వివేకరహితులు పైకియెంతో పండితులమని బింకములు పల్కినను తలక్రిందులై తెలియకున్నారు. అట్టి స్థితిలో నిన్ను తెలిసికొనుటకు నాబోటులగు వారెంత?

బ్రహ్మమొదలగు దివ్యవిభూతి విరాజితులే నీ మాయ నెరుంగనివారు కాగా సర్వజ్ఞుడుగా నిన్నెవరు తెలిసికొనగలరు? ఈ కృత్య విశేషము కించిజ్ఞులకు జేతనైనపని కాదు గదా! పరమాణువులలో పరమ పరసహస్రాంశముగనైన జేయజాలని అస్మాదృశుడు, మీ అనంతాఖండ సత్యశివసౌందర్య స్వరూప మహిమను దెలియనశ్యుడు కాగలడా! కావున సోమల్లేశా! నా కిల్బిషమునడంచి సర్వదా కాపాడుము'' అని ప్రార్థించి నంతనే శివుండు ప్రత్యక్షమై ఆతని పిశాచత్వమును బోగొట్టి దివ్య

శరీరము గలవానిగా జేసినట్లుగలదు. అట్టి శ్రీ మల్లేశ్వరస్వామి మహాత్మ్యము ఇంతయంతయని నుడువుట కెవ్వనికితరంబగును ? ఒకే సమయమందు కోటిమంది ప్రార్థనలైనంగాని రక్షింపం గల సదాశివునకుఅనేక నమస్కారములు.

## స్కాందపురాణాంతర్గత కథనము

కాకానిమల్లేశ్వరస్వామి కోవెలలో ననేకులు రాత్రిం బవళులు నివసించుచు భజించుచు, జపించుచు స్వామిని సేవిం చువారుందురు. అట్టి భక్తులకు నెన్నియో సాదృశ్యములు కనంబడుచునే యున్నవి. శారీరకముగను మానసికముగను దేవు నకు ప్రీతికరములుగ చేయగల్గు విధులును, నందుకుగలుగు ఫలిత ములును దెలియగల స్కాందపురాణాంతర్గత కథనం బిట నుదాహరించుచున్నాను.

"సూతుండు మునిశ్రేష్ఠులను వీక్షించి యిట్లు వక్కా ణించెను. ఓ ఋషులారా! అనుదినము శివాలయముతుడిచి జలముచిలికించి దేవునికరుణకు పాత్రులైనవారు జీవితాంతము వరకు జనులందరిచేతను గౌరవమునొందగలరు అంతిమకాల మందు కైలాసవాసులై సుఖవంతులగుదురు. శివుని యెదుట అద్దమునుంచినవారు కష్టపరంపరల ననాయాసముగదాటి తుదకు శివసాయుజ్యము నొందెదరు. శివునకు వింజామరలు యిచ్చు

వారును, వింజామరలచే వీచువారును సర్వజనులచేతను పూజింపంబడుదురు. శివాలయమును ప్రతిదినము కనీసము కార్తీక మాసంబంతయునైనను దీపారాధనచే దేదీప్యమాన మొనర్చిన వారు తేజస్సుగలవారై పాపాంధకారమునంటక జీవింపగలరు. దీపదానము శివాలయమం దొనర్చినవారికింకను విశేషఫలంబు గలదు. దీపదానము - అనగా గోధుమపిండితో ప్రమిదచేసి నేతితో నింపించి పమిడిప్రత్తితో చేసిన వత్తిని అందువేసి వెలిగించి దక్షిణతాంబూలములతో శివభక్తిపరుడైన బ్రాహ్మణునకు దానముచేయుట. ఇట్లు దీపదాన మొనర్చినవారు రూప గుణ వికాసములచేత మించి తమ తమ వంశములవారికిగూడ మోక్షమునకు మార్గదర్శకులగుదురు. హరిహర భేదరహితులై నైవేద్య మొసంగి నమస్కరించువారు గొప్పయజ్ఞమొనర్చినంత ఫలితము నొందుదురు. శిథిల శివాలయములను బాగొనర్చిన వారు నూతనాలయములు కట్టించినవారికంటె ద్విగుణీకృత ఫలితమునొందగలరు. క్రొత్తగా శివాలయమును కట్టించినవారికి దివ్యమైన భవనము స్వర్గమునందు కలుగును. ఇహమునందు యుగములతరబడి నిలుచునట్టి స్వచ్ఛమైన కీర్తి గలుగును శివ కైంకర్యములకు భూమినిచ్చినవారు ఇహమునందు సౌఖ్యము, పరమునందు మోక్షము నొందగలరు. స్వయముగా నిర్మించి నటువంటి శివాలయమునకైనను ఇతరులు కట్టించిన శివాలయమునకైనను సున్నము వేయించి, రంగులు మొదలైన అలం

కరణ చేయించినవారు సుఖముగా జీవించుచు కైవల్యమును పొందగలరు శివునకు వస్తువాహనములు సమర్పించువారు వంశశ్రేయమును, శివసాయుజ్యమును పొందగలరు. శివాలయమునందు ఓంకారము నొనర్చుటకు ఘంట నేర్పరచువారు లోక ప్రఖ్యాతినిపొంది లక్ష్మీప్రదమైన తేజస్సుగలవారగుదురు. దినదినము శివునిదర్శించి ప్రదక్షిణ నమస్కారములొనర్చువారు ధనవంతులగుదురు. అన్నాహారములు సంతుష్టిగా లభించును. వారికి క్షుద్బాధయనునది గలుగనేరదు. భక్తిశ్రద్ధలతో "నమశ్శివాయ" అని జపించుటగాని శివనామ భజనము సలుపుటగాని గలవారు తమ తమ కులమునంతటిని శివసాయుజ్యము పొందించుట కర్హులగుదురు." ఓంతత్సత్.

## మల్లేశ్వర లింగ మహిమ

కాకానిమల్లేశ్వర లింగపూజా, అభిషేకాదులు మిక్కిలి యొనర్చి సత్ఫలితములను పొందిన వారెందరోగలరు. స్వగృహములందుగాని, వసతి గృహములందుగాని మల్లేశుని పూజింపవలెనన్న లింగాకారమునేపూజింపవలయును. ఇందుకై శ్రీనాథ కృతాంధ్రీకరణ "భీమేశ్వర పురాణాం"తర్గత శివలింగ రచన, మహిమలనుగూర్చిన పద్యంబిట గననగును

సీ॥ సకల లోకప్రపం ♦ చము లింగమయమ్ము
త్రిజగమ్ము లింగప్ర ♦ తిష్ఠితమ్ము
సంభవస్థితి లయ ♦ స్థానంబు లింగమ్ము
లీనార్థ గమనము ♦ లింగమనగ
లింగప్రసాదము ♦ లేకసిద్ధింపవు
భోగ, మోక్షంబులే ♦ యోగములను
లింగాజ్ఞ వెలిగాగ ♦ లేశ మాత్రంబును
సంచలింపదుపో త్రు ♦ ణాంచలమ్ము

గీ॥ మంటి నైనను లింగమ్ము ♦ మలిచికొలుడు
ఇసుక నైనను లింగమ్ము ♦ నేర్చి కొలుడు
పేడ నైనను లింగమ్ము ♦ పెట్టి కొలుడు
నీటనైనను లింగమ్ము ♦ నెన్నికొలుడు (57–3 ఆరా॥)

"సర్వంలింగమయంజగత్" అంతేగాక "బోళాశంకర్" అగుటచే భక్తుల కింతకన్న నారాధ్యదేవుం డితరత్ర ఎందుకు కానలెను ?

శ్రీ మల్లేశ్వరస్వామి గంగాసహిత భ్రమరాంబాదేవి ఉత్సవములు జరుగుచుండును; అందు సర్వాంగ సుందరంబైన విగ్రహామూర్తులు మణిమయాభరణ కిరీటాదులచేతను; స్వర్ణా

మూల్యవస్తు, వస్త్ర, వాహనములచేతను, మల్లికదంబాది పుష్ప మాలికలచేతను అలంకరింపబడి మిక్కిలి ప్రకాశించుచుండును. పండుగ పండుగకు మహోత్సవములు, మొదలగునవి ఎన్నో రీతుల బ్రహ్మాండముగ జరుగుచుండుట జగద్విఖ్యాతము.

# శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర కళ్యాణము

శ్రీ మల్లేశ్వరస్వామి కళ్యాణము ఏటేట శివరాత్రికి 5 రోజులు "శ్రీ మల్లేశ్వరాలయ" ట్రస్టీలు, మేనేజింగు ట్రస్టీ. ఎగ్జిక్యూటీవు ఆఫీసరు వారి యాజమాన్యమున జరుగుచుండును.

స్వామి కళ్యాణ సమయంబునకు అనేక దూరప్రదేశం బులనుండి కూడ భక్తులు తమ బంధుకోటి నాహ్వానించికొని విచ్చేయుట యెంతో విశేషముగా నుండును.

ఈ కళ్యాణ ఘట్టమున శ్రీ ముత్తుగ్గా రాజకవివరాం కయ్యంకి బాలసరస్వతీశ్వర కృతాంధ్రీకరణ సటీకనాగరఖండ రెండవ భాగంబు, పంచమాశ్వాసంబు ప్రశస్తంబగుటచే యా ముఖ్యాంశ వర్ణనలిట నుదాహరించుచున్నాను.

హిమాచలేశ్వరుని సన్నిధికి మునులరుదెంచి సర్వేశ్వరుం డైన సదాశివుడు మీ కన్యను వరించెను గాన! కళ్యాణ మొన

ర్చుట ఉభయత్రా నేమైనపని అని బోధించుట యీ క్రింది పద్యమునందు గననగును.

శా॥ ధన్యంబయ్యె భవత్కులంబు జగదా♦ధారుండు దేవుండు స
న్మాన్యుం డార్యజనైకపూజ్యుఁడు సదా
♦ నందుండు శర్వుండు మీ
కన్యారత్నముఁ బెండ్లియాడుటకుఁగా ♦ కంగోరియున్నాఁడు
మీ, కన్యాన్యంబుచితంబు బాంధవము
♦ దార్యస్తుత్య మా దృష్టికిన్. (102)

ఋషులిట్లాదేశించి నుడివిన తోడనే హిమనగరాజత్యంత సంతోషాయత్త చిత్తుండై "శుభస్యశీఘ్రం"బన్నట్లు తక్షణంబే సుముహూర్తంబున్నిర్ణయించి శుభలేఖ నంపుటయు కైలాసంబు నుండి నందివాహనారూఢుండై శంకరుండు సమస్త దేవతానీక ములతో బయలువెడలి హిమనగేంద్రునింట విడిసిరి. అంత నా సదాశివుని పెండ్లికొమరుని జేయుటకై కొందరు ముత్తైదువులు తలపడిరందు,

మ॥ తలయంటెంజెలియోర్తు మేన గలగం ♦ ధంబోర్తు పట్టించె వే,
జలకంబార్చె నొకర్తు మడుగుల్ ♦ సంధించెనొక్కర్తుమై,
నలదెంజందన మోర్తు పీచెసురటిన్ ♦ హారాదులర్పించె నొ
క్కలతాతన్వి మహానుభావుఁడగు గం ♦గాపూళికిన్వేడుకన్.

మఱియు పార్వతీదేవిని పెండ్లికూతుం జేయుటకై-

కం॥ అలరగ నొక్కతె కస్తురి
తిలకము నలఫాలసీమ ♦ దిద్దెను రమణీ
తిలకంబున కతివేగమ
మొలకనగవులాననమున ♦ ముప్పిరిగొనగన్. (125)

కం॥ ధవళాక్షి యొక్కసతి యభి
నయముగ శోభనతరాంజ ♦ నము ఘటియింపన్
భువినీలోత్పల లోచన
యవునఁగ నగేంద్రకన్య ♦ యప్పుడమించెన్ (126)

కం॥ ఆరమణి మయూఖోత్తమ
హారమణీ రుచులమించె ♦ నభినవ లావ
ణ్యాహూతి జగన్మధ్యము
హారమణీ రుచులకంటె ♦ నతిశయమందన్. (129)

కం॥ ఆ కలికి నితంబము ర
త్నాకర మేఖలవహించి ♦ యలరెనుమును
రత్నాకర మేఖలతానన
నైకనుపట్టుచుఁదనప్పు ♦ నవనియుబోలన్. (132)

ఇట్లు సర్వాలంకార శోభితయైన పార్వతీదేవిని పరమే శ్వరునకిచ్చి వివాహమొనర్చుట ఈ క్రింది పద్యమునగననగును.

శా॥ కమలాధీశ్వర సన్నుతాయ విలస
త్కంజాభ పాదాయ వం
ద్యమునీంద్రార్చిత దేవతాయ నిగమాం
త్యస్తోత్ర పాత్రాయ భ
క్తముఖాంభోరుహ భాస్కరాయ సుమనో
గంగోత్త మాంగాయ తు
భ్యమియం సంప్రదతేయటంచొసగె శై
లాధీశ్వరుం డాత్మజన్. (135)

ఈ విధముగా నైన పార్వతీ పరమేశ్వరుల కళ్యాణమును విశ్వస్రష్ట, స్రష్ట, విష్ణు, అగ్ని దేవుడు - దిక్పాలురు, వాయు దేవుడు, ఇంద్రాది దేవతలు, మునులు, యక్షులు, కిన్నరులు, కింపురుష, సిద్ధ, సాధ్య, విద్యాధరులాదిగాగలవారెందరో వీక్షించుచు బ్రహ్మానందము నొందియుండిరి. మనము అటులనే శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరుల వైభవోపేతమగు కళ్యాణమును కనులారగాంచి ధన్యాత్ములమయ్యెదముగాక. ఇంక నీ శివ, భవానులు చక్కదన గర్వమునగల్గించిన ఒకపిడిచే సరేశ్వరుండు లింగ స్వరూప, పరబ్రహ్మముగ పూజింపబడుటను గూర్చి వివరించుచున్నాను.

# పార్వతీ పరమేశ్వర చక్కదన కధనము

## లింగంబైన శివుండే పరబ్రహ్మంబగుట

కైలాసంబున సమస్త దేవగణంబుచేతను సిద్ధ, సాధ్య, విద్యాధర, కిన్నర, కింపురుష, మునిగణసేవితంబుగ బెద్దపేరోలగంబుండి పురాణ దంపతులైన పార్వతీ పరమేశ్వరులు చలోక్తిగా చక్కదనంబునందు దమ యిరువురిలో నొకరికన్న నొకరెక్కుండని తర్కించుకొని యాసభాసదుల నీ సందర్భమునందు తేల్చి చెప్పుండని కోరిరి. అందుపై (విశ్వకర పురాణగ్రస్త) కథ న్నబిట నుదాహృతము ఆమీమాంసలో-

సీ॥ పాకశాసను డగ్ని ♦ పైదృష్టి సంధించె
నసలుండు క్రేగంట ♦ యమునిజూచె
దక్షిణదిక్పాలుఁ ♦ డీక్షించె ని ఋఋతి
నరవాహనుండు న ♦ వ్వారుణుఁజూచె
నంభోధిపతి వాయు ♦ వాననం బీక్షించె,
శ్వసనుఁడంధక వైరి ♦ సఖునిఁజూచెఁ
దక్కినదివిజులం ♦ దరు చూచిరమరుల
నమర వైరుంజూచి ♦ రచటిమునులు

సీ॥ మానులాయక్షుపరుల స ♦ మ్మతినడిగిరి
యక్షులంట కిన్నరులఁదెల్పు ♦ మనిరివారు
సిద్ధులను దెల్పుమనిరి యీ ♦ స్థితిననొకరి
నొకరు పొరిజూపులనుజూచు ♦ చుండిరటయు.

ఉ॥ అయ్యెడభీతిఁబెల్లదరి ♦ యాసురవైరి సహస్రలోచనుం,
డయ్యెను వహ్నిదాజ్వలనుఁ ♦ డయ్యెను దక్షిణభర్త ధర్మరా
జయ్యెను మానులైరి యక్షు
♦ లందరు వాయువు దా సదాగతుం
డయ్యెను జిత్తమింతకల
♦ దాయమితాప్పుతచిత్తవృత్తులన్ (వి. పు తృ. 12)

శా॥ కాలాతే చక్కనివాడటన్న మనపైఁ ♦ జూపోవదీకాళి ఇా
చూలేచక్కనివానటన్న మఱియున్ ♦ జూపోవడీకాలి ఇ
ష్టేలీలన్వచియించఁదవ్వ మనపై ♦ నేవచ్చునీ కాళినిన్
కాలిన్ మించగరాదు కొంచెమిదియం
♦ చున్ బల్కరాదియ్యెడన్ (వి. పు. తృ 14)

కం॥ ఇందుకేమి యుపాయము
కందుమనుచు సురలు విశ్వ ♦ కర్మనుమదిలో
నందఁబోయగ నపుడా
నందముగనతఁడు సనకస ♦ నందనయుతుఁడై (తృ. 16)

కం॥ వేంచేసె సురలు వొగడఁగఁ
బంచమహా వాద్యచయము ♦ పరివరిగతులన్
మించి దివిభోకుకొలుపగ
నంచుల నొకన్ల నిల్వ ♦ టద్దము తేరన్. (తృ. 17)

వ॥ అంతన్భవానీభవులిర్వురా నిల్వుటద్దంబునందు తమ తమ రూపురేఖా విలాసంబులం దిలకించికొని అమందానంద కందళి తారవిందమానసులై విశ్వకర్మను సంస్తుతించి సత్కరింప నేదేని కోరుకొమ్మనుటయు నందుకా విశ్వకరుండు-

కం॥ నా కల్పితములు గానివి
లోకంబున లేవు ఫాల ♦ లోచన చూడన్
నీకెటులున్నదో కాకేఁ
జేకొనియెద దాని పేరు ♦ జెప్పుమటన్నన్."

అందుకు సదాశివుండు పర్యాలోకన మొనర్చి ఓ విశ్వసృట్! నీవు కావలెనని కల్పింపకపోయినను దారిద్రదేవత యొక ఉేర్పడుచున్నది. అట్టి దానిని వరింతువేని గైకొనుము" అనిన నతండ శాంతితో ఓపరమశివా! పేరుచెప్పుచున్న వరింపు మంటివి. నీ చక్కదన గర్వంబిఁతకుఁదెచ్చినది. "లింగాకృతి నొందెదవుగాక." అని శపించెను. పార్వతిదేవి ప్రాథేయ పడగా నావిశ్వస్రష్ట కరుణించి శంకరుని శృంగార భూషాదులు మార్చుట యీక్రింది పద్యనందు వర్ణితంబయ్యెను. చూ॥

సీ॥ గురిగాక లోకయో ♦ మరి కోకయోలేక
　　　　కరిచెర్మ మెప్పుడు ♦ గట్టికొనుము,
　　అవని వనముల ని ♦ వాసంబులేక స్మ
　　　　శాన దేశంబున ♦ శయన మొందు,
　　శ్రీయూర కేయూర ♦ గేయూరములులేక
　　　　సర్పకంకణములు ♦ సరగ బూను,
　　భూధర కోదండ ♦ పూదండలేకస్థి
　　　　ఘనమాలికలఁగంఠ ♦ మున ధరించు,
గీ॥ పరమ గుణసాంద్ర సౌవర్ణ ♦ పాత్రలేక,
　　పునుక కంచంబు లోఁజేయు ♦ భోజనంబు,
　　వెఱయ మనసార ఘనసార ♦ మెలమిమేన,
　　బూయుటలుమాని భస్మంబు ♦ బూసికొనుము(26)

అనిన విని దాక్షాయణి వదంపడి దారిద్ర్యవిచ్ఛిత్తికై ఒడంబడుటచే విశ్వకరుండు సుప్రసన్నుండై మగుడి శంకరును ద్దేశించి సమస్తదేవ, దానవాదుల కిట్లనియె; ఓ సభాసదులారా!

ఉ॥ ఎవ్వఁడు దాల్చునెమ్ముల మ
　　　　♦ రెవ్వఁడు సారెకు పున్కబూనువాఁ,
　　డెవ్వఁడు దాను సర్పముల
　　　　♦ నెప్పుడు జేకొను మేనభూతి దా,

నెవ్వాఁడు బూయు నాగదను
♦ జేశ్వరు చర్మమునంశుకంబుగా,
నెవ్వాఁడు మేనగప్పు నతఁడే
♦ భువి బ్రహ్మమటంచు నెంచుడీ." (34)

ఈ విధంబుగా శివుండె "పరబ్రహ్మం"బని నిర్వచించి యా విశ్వసృట్ అంతర్హితుండయ్యెను. తదాది లింగాకృతిం బూజలనందుచూ భూషణాదులు వేరైనను పరబ్రహ్మంబుగ నెల్లవారిచే నంస్తుతింపంబడుచుండెను ఇంకనీ మల్లేశ్వరుండైన శంకరుండె బ్రహ్మ, విష్ణువులకన్న నధిక మహిమాన్వితుండని దెలియందగు పురాణ ప్రసిద్ధ కథనంబే క్రింద గనంబరచెదను.

# బ్రహ్మాది దేవతాధీశుఁడే మల్లేశ్వరుడు

ఒకప్పుడు బ్రహ్మ, విష్ణూ; శివస్ఫురహానే మరచి తమలోదా మొకరికన్న నొక్కరెక్కుండని వివాదపడి కలహించి తుదకు ఘోరాతిఘోర రణరంగమున కియ్యకొనిరి. అప్పుడు వారొకరిపై యొకరు ప్రయోగించు శరపరంపర సంఘర్షణకు భీష ణాగ్ని యేర్పడి కనుమూసి దెరచునంతలో భూనభోంతరముల నేకముసేయనో అన్నట్లు అతీతమైన యొక స్థంభాకృతి ఘటిల్లెను. అట్లావిర్భూతంబైన స్థంభాకృతిలో బ్రహ్మ; విష్ణు

వులు విడచు బాణసంచయంబంతయు విలీనంబగుచుండెను. అందుకై వారు నిశ్చేష్టితులై "ఈవింతస్థంభం బెచ్చటనుండి ఎంతఎత్తువరకు పెరిగినది? దీని ఆద్యంతములు ముందు మనము కనుంగొని ఆవల దీనిందొలగించు నుపాయంబాలోచింతము. ఇందుసను గెల్పు ఓటమి ననుసరించి మన యుక్తాయుక్తములు నిర్ణయించుకొందుముగాక. అని, విష్ణువు వరహావతారమెత్తి పాతాళంబువరకై నను కృశ్ఛగించుకొనుచుపోయి యీ స్థంభ పునాది గనుంగొనివచ్చెదన్న; బ్రహ్మ "హంసస్వరూపినై గగనంబునకెగసి ఖగోళంబంతయు నెమకియైన యీస్థంభాగ్రము గనుంగొనెద"నని వాక్రుచ్చెను. అట్లగాక యని ఉభయులు తమ నిశ్చితావతారములెత్తి ప్రయాణము సాగించిరి. హంస స్వరూపియైన బ్రహ్మ గగనంబున ననేకకోట్ల యోజనంబు లెగసిపోవుచుండెను. పోగా పోగా అలసట యెక్కుడై ఆ స్థంభాగ్రము గనుంగొన నశక్యమే యన్న నిస్పృహకు గూడ గురియయ్యెను. ఇంతలో పైనుండి ఒక కేతకీ కుసుమము (మొగలి పువ్వు) వ్రాలుచుండుట గననయ్యెను. అప్పుడు బ్రహ్మ "ఓ కేతకీ కుసుమ రాజమా! నిలువుము. నీవీ స్థంభాగ్రము నెరిం గియుందువు. కావున నేను ఇప్పటికే చాల డస్సియున్నాను. ఇంక నొక్క యోజనంబైన నెగురలేని స్థితిలో నున్నాను. నా కొక్క సాయముచేయవలెను. అందువలన నా ప్రాణ, మాన

సంరక్షణ చేసినదాన వగుదువు; అదేమియన పందెముపై నే నీ స్థంభాగ్రము గనుంగొన వచ్చితిని. నేను యీ స్థంభాగ్రము చేరగల్గినట్లు నీవు సాక్ష్యము చెప్పుటమాత్రమే కావలెను. అని వక్కాణించిన తోడనే మొగలిపూవు తనలో "ప్రాణవిత్తమాన భంగము దాడిసది అసత్యమైనను దోషముగాదను ధర్మ మున్నది అందు బ్రహ్మ అంతవాడు నన్ను అర్థించుటలో నేనీ మాత్రము వాక్సహాయము చేయుట ధర్మమే కావచ్చు" నని తర్కించుకొని బహిర్గతముగా - హంస స్వరూపముననున్న ఓ బ్రహ్మ! నీవు కోరినట్లు ఒనర్చెదగాక, యీ స్థంభాగ్రము గనుంగొనవలెనన్న నేటికిని తరముగాదు "పద పద" యనుట తోడనే మిక్కిలి సంతోషంబున; మనోవేగంబున క్రిందికిదుమికిరి.

ఇంతలో విష్ణువు వరాహావతారంబున భూమిని క్రుళ్ళగించుకొనుచు పోయి పోయి 'పాతాళంబునుండియే గల్గియుండ నోపు' నని గ్రహించి ఆశాభంగముతో తిరిగివచ్చి కూర్చొని యుండెను. అదిగాంచి బ్రహ్మదేవుడు ఓహో విష్ణూ! ఓడి పోతివి. నేను గెలిచితిని యీ స్థంభాగ్రమునకేగి తిరిగివచ్చితిని; అనగనే విష్ణువు "అవును నేను ఓడితిని, నీవు గెలిచినట్లు ఎవ్వరైనా సాక్ష్యమున్నగదా నమ్ముట" అనగనే బ్రహ్మ "ఓ! సాక్ష్యమునకేమి? ఈ కేతకీ కుసుమమే యిందుకు సాక్ష్యము. వలసెనేని అడిగి తెలిసికొమ్ము" అని నిరాఘాటముగా నిర్వ

చింపెను. అప్పుడు విష్ణువు "ఓ కేతకీ! నీవు నిజము చెప్పుము. ఈ బ్రహ్మ యీ స్థంభాగ్రము గనుంగొనుట నిక్కమేనా!" అని యనగనే కేతకీకుసుమ మిట్లనియెను. "ఎందుకీ కయ్యము ఇది శివప్రభావోపేత మహాలింగము. ఈ లింగాగ్రము బ్రహ్మ కనుంగొనుటలో నాశ్చర్యమేముండును. బ్రహ్మ చెప్పిన దంతయు సత్యమే' యని సాక్ష్యంబొసంగెను.

ఇదె యంతయు సర్వేశ్వరుండగు సదాశివుండు కనుం గొనుచునే యుండెను. అభేద్యమైన ఆ స్థంభాకృతి నంతర్ధానంబై ఆ బ్రహ్మ విష్ణువుల మ్రోల గజచర్మధారియై జటాజూటంబున గంగవెలయ త్రిశూలధరుడై; నందివాహనారూఢుడై పరమేశ్వరుండు ప్రత్యక్షమై "ఓ బ్రహ్మదేవా! నీవును యీ కేతకియు అనృతదోషంబుచే పూజానర్హత నొందితిరి. అనగనే అందరు శివుని గొప్పదనము నెఱింగి పాదాక్రాంతులైరి. శంకరుండు బోళాశంకరుండగుటచే "బ్రహ్మ కట నట పూజగల్గు"ననియు, "కేతకి విష్ణుపూజ కర్హంబగు"నని వరంబులొసంగెను.

## బ్రహ్మ విష్ణువుల గర్వభంగము

ఇదే సందర్భమున శ్రీనాధ విరచిత "శివరాత్రి మాహాత్మ్యము" నందలి ప్రథమాశ్వాస 104, 105, 106 పద్యము

లను గాంచదగియుండెను. బ్రహ్మ, విష్ణులు, శివస్తోత్ర మొనర్చుట, సర్వేశ్వరుని మహిమ ఇందు గానవగును.

సీ॥ శర్వలోకాధీశ ♦ చంద్రార్ధశేఖర!
పురుషపూరణ శం ♦ కర మహేశ!

అభవయంతర్యామి ♦ వై ప్రేరకత్వము
చేపట్టిజనుల శా ♦ సింతువీవు

భవదీయ మాయా ప్ర ♦ భావంబు కతమును
నెఱుఁగలేమయితిమి ♦ యేమునిన్ను;

మాకుఁ గర్తవు నీవు ♦ మాకు భర్తవు నీవు
మాకు హర్తవు నీవు ♦ మాటలేల?

గీ॥ నీ మహత్వంబు వర్ణింప ♦ నేరమేము,
నిన్నుఁదెలియంగ నేరము ♦ నిజముగాఁగ,
నభవ యాద్యంత వాథ్యుండ ♦ వగుదుగాన,
నట్టి నీ కాచరింతుము ♦ షాస్త్రియెపుడు. (104)

గీ॥ పశువులము మేము హర! పశు ♦ పతివి నీవు,
పశువులకు నెక్కడిదిబుద్ధి ♦ ఫాలనయన
రాజశేఖర నేప్పు నే ♦ రములు చూడ,
కరసిరక్షింపుమమ్ము ♦ నత్యంతకరుణ. (105)

గీ॥ అమరవంద్య దివాభీత ♦ మనెడిపులుగు,
హేళిమండల మీక్షింప ♦ నెట్లునేర్చు,
నేము నిను వినుతింపఁగ ♦ నెంతవార,
మిమ్మహాపరాధము క్షమి ♦ యింపవలయు." (106)

అని యివ్విధంబున స్తుతించినం బ్రసన్నుండై పరమేశ్వరుండా బ్రహ్మ, విష్ణువుల గర్వభంగంబై నందుకు సంతసించి శివరాత్రి మాహాత్మ్య కథనం బెరింగించినట్లుకలదు.

కైలాసవాసియైన సాంబశివుండు పార్వతీ సమేతంబుగా గగనవీథినేగుచు భూస్థలింగల "కాకాని"ంగాంచి తొల్లి మహాభక్తుండైన కాకాసురుండు గోమయలింగంబును బ్రతిష్ఠించి, పూజించి, తపస్సుచేసి తరించినచోటుగా గ్రహించి యచ్చోటు నాకర్షించి ప్రజలను రక్షించుటకై మల్లేశ్వర నామంబున నా లింగమునం దావిర్భూతంబైయున్నట్లొక యితిహాసంబుగలదు. కాకాసుర వధానంతరం శ్రీ రామచంద్రుడా లింగమునకే కోటిపత్రిపూజ యొనర్చినట్లుకూడ తెలియనగును.

## వ్యాసుని పక్షపాతము-శ్రీ మల్లేశ్వర మహాత్మ్యము

ఇంతకు పూర్వమే శ్రీ మల్లేశ్వరస్వామి మహిమాన్విత విశేషము లభివర్ణించుచు శ్రీ తాడేపల్లి వేంకటప్పయ్యశాస్త్రి

గానొక పద్యకావ్యమును (1922) "శ్రీ కాకాని మల్లేశ్వర మాహాత్మ్య"మను పేర రచియించి ప్రచురించి యుండుటచే శ్రీవారికి కృతజ్ఞతం దెలుపుచూ అంజలి ప్రథమాశ్వాసము వ్యాసుని గూర్చిన పద్యాదుల నిట నుదాహృత మొనర్చెదను.

"వ్యాసోనారాయణోహరిః" అని పొగడంబడిన వ్యాసులవారు కాశి కేగి యట గంగాజలంబుల గ్రుంకులిడి ఆ కాశీ విశ్వేశ్వరునికన్న మిన్నయైనట్లు కేశవుని సంస్తుతించుచు చేయెత్తుట నీ క్రింది పద్యమునందు గాంచవచ్చును.

గీ॥ పక్షపాతంబొ రాజస ♦ భావమో మ,
హాత్ముడాతని కొదవె నే ♦ మనగవచ్చు,
కేశవుండె పరాత్ముండు ♦ గీర్తినీయు,
డతడె యనెగంగలో నుండి ♦ హస్తమెత్తి." (131)

(గంగలో అటులా వ్యాసుండెత్తిన హస్తమును నంది కేశ్వరుండు వీక్షించి ఛేదించెననియు, ఆ హస్తసంజ్ఞగ వీరముష్టి వారిండ్లు పెపు ప్రభలందొక హస్తము నలంకరించి వ్యాసహస్తమని చెప్పుచుండుటయు గలదు.)

4)

# వ్యాసర్షి శివునికెగ్గొనర్చి పొందిన శిక్ష

## అన్నపూర్ణా దేవి మహాత్మ్యము

హస్తంబెత్తి శపథం బొనర్చినప్పుడు వటురూపంబున దన యెట్టయెదుట సాక్షాత్తు విశ్వనాథుండే ప్రత్యక్షంబుగ నుండెను; గాని వ్యాసుండా మహత్తత్వముం గుర్తింపలేక పోయెను.

"రుద్రాక్ష భూతి భూషణ, ముద్రాంకితు నెదుటగన్న ముదమున సాక్షా, ద్రుద్రుండని దలపడేని? శివద్రోహుండు, నరకగామి..."యగునని "శివతత్వసార" ద్రుఢీకరణంబగుట నీ వ్యాసుం డాకోవకు జెందిన వాండయ్యెను.

కాశీ, కల్పతరువుంబోలి నిత్యాన్నదాతలకు నెలవై మించియుండును; అట్టితటి వ్యాసునకానాడు భిక్ష పురంబంతయు దిరగినను గలుగదయ్యెను నాడెగాక ఏడహోరాత్రంబులు "అన్నమో రామచంద్రా"యని అలమటించుటయ్యెను.

"ఆ॥ వె॥ కడుపులోనిమంట ♦ గాదన్న మరలదు,
శిష్యగణముతోడఁ ♦ జెలువుదక్క,
తిరిగి తిరిగి విసిగి ♦ దేవతుల్యుండతం,
డన్నమన్నమాట ♦ కలతిపడియె. (138) ప్ర॥

ఎట్టకేలకు నా వ్యాసమహర్షి కోపోద్దీపిత మానసుండై కాశీని శపించుటకే దలంపడియెనఁట; అందుపై అన్నపూర్ణా దేవి యాతని యవివేకంబునుం బాపనోయన్నట్లొక గృహ విధుషీమణిగ నిలిచి సముచిత గంభీర వచనంబుల నిట్లనియెను.

ఓ వ్యాసర్షి! నీకింతకోపంబేల? భోజనంబునకైగదా? అట్లైన మీ యందరకు నే నిదే భోజనంబిడియెదను; వేం చేయుఁడు. అని యాహ్వానించెను. అందుకెంతయు 'పెన్నిధి యబ్బిన పేదలకైవడి మిక్కిలి సంతసించి-

కం॥ బంతులదీర్చిరి తోడన,
సంతోషము వొడమదయ్యె ♦ సంయములకు వా
రెంతటి యాసఁ బెనంగెద,
రంతలు సందియము లెడఁద ♦ లం దొదవుటచేన్. (159

భోజనంబులకై సంసిద్ధపడియున్న యా వ్యాసాదులకు శివభక్తి యిసుమంతయేని గలుగదయ్యె. అందుచే యదృశ్యం బుగ నటనేయుండిన యన్నపూర్ణాదేవి భోజ్యపదార్థములు వడ్డన సేయకపోయెను. అటులం గొంతవడి యూరకుండి మరల వారికి గోచరించుచూ నన్నపూర్ణాదేవి యిట్లనుచున్నది.

"కం॥ మీ నియమః లేమఱకుఁడు,
ధ్యానింపుఁడు రుద్రసూక్త ♦ తత్పరులైని,

ధ్యానింపుఁ డేకలక్ష్యత,
నానంద వికాసమొలయ ♦ నందఱునోకటన్" (165)

"ఇంక మీరలందఱు నొక్కమొగిఁ గన్నులు మొగిచి మానస వృత్తిన నెల్లపదార్థంమ్ములు తమ ముందున్నట్లూహించి శివార్పణం బొనర్పుఁడని నియోగించి తాను శివనామోచ్చారణావధానంమ్మున మించిన; నా వ్యాసుండు మొదలగువారు నీక్రింది విధంబునం బఱిపఱి విధంబులం దలంచి తుదకు

"ఆ॥ ఏమివడ్డనంమ్ము ♦ లిందుఁ జూపట్టవు,
చోజ్యమయ్యె నెట్లు ♦ సుదతియాన,
మెలఁగుటింక మనకు ♦ మేలు గాకని వార,
లాచరించిరట్టు ♦ లందఱోకట" (173)

"వసంపసి యుత్తరోపచారంబులు నెరపి పరిషేచనంబులు గావింపనగు నను మేలిశాసనంబు దోతెంచిన నాలకించి మహోత్సాహంబున; వార లట్లొనర్చినయనంతరంబ

ఉ॥ కన్నులు విప్పిగన్గొనిరి ♦ కమ్రఘుమంఘుమ వాసనాను సం,
పన్నఘృతాక్త భవ్యపరి ♦ పాక రసోచిత భక్ష్యభోజ్య చి
త్రాన్నరసాయన ప్రముఖ ♦ హార్దపదార్థ పదార్థజాతమా,
పన్నులు వారు కామదుఘ ♦ పాల్పడి పంచిన భాగ్య
మట్లుగన్. (175)

ఆ॥ వె॥ అటుభుజించి యుత్త ♦ రాపోశనములొన
రించి చనిరి నెలవుఁ ♦ గాంచి శుద్ధు,
లగుచుఁ జేరునంత ♦ ననువుగఁ దాంబూల
ములను దక్షిణలును ♦ మొనయఁగూర్చి. (184)

అన్నపూర్ణాదేవి యీ క్రిందిరీతి వ్యాసునకు బుద్ధిచెప్పి వెడలఁగొట్టుట గాంచుఁడు.

కం॥ కలుషములు వాపఁదొడరెడు,
కలికాముములడఁప ♦ మేలి కలిమింగూర్పన్,
గలసులభి యెట్లు నీమది,
గలిగెన్ గళ్యాణరాశిఁ ♦ గాశిందిట్టన్. (190)

"కం॥ పంచ క్రోశపురమ్మున,
వంచనమెయి నిలువఁజనదు ♦ వా యనుచో, గం
టించెదనిను నీవారలఁ,
గ్రించుతనమ్మెడలిపొమ్ము ♦ కీర్తితవృత్తిన్. (192)

అని యన్నపూర్ణాదేవి కాశి యొక్క విశిష్టతఁదెల్పి వెడలఁగొట్టిన నతండు జనుచు నదియంతయు శివ మహిమగ గ్రహించి తనకెదురైన సనత్కుమారుతో నిట్లనుచున్నాఁడు.

ఆ॥ ఎఱిఁగి యెఱిఁగి శివున ♦ కే నెగ్గుఁగావింపఁ
గాశినుండి వెడలు ♦ గతిఘటిల్లె,

నట్టి తీర్థరాజ ♦ మవల నొండొకండున్న,
శ్రీ సమృద్ధిఁ జెవికి ♦ జేర్పుమయ్య. (216)

కం॥ శివతత్త్వ రహస్యంబును,
శివమంత్ర విశేషమహిమ ♦ శివభక్తిపరుల్,
శివుఁగాంచి కాంచు విభవము,
శివయోగివరేణ్య! తెలియఁజెప్పుము నాకన్. (217)

అని వ్యాసమహాని సనత్కుమారుని పదింబదిగ ప్రార్థించి శివమహిమగల ప్రదేశం బింకొక్కటున్నఁ జెప్పుమని కోరుటయు నందు కతండు శ్రీశైల మల్లికార్జున మహిమాతిశయంబులు చెప్పుటయు, అంతటితో నా వ్యాసమహానికి దివ్యజ్ఞానముకలిగి కాశీవిశ్వేశుని భక్తిప్రపత్తులతో ధ్యానించుచు నిలిచి కాశ్యష్టకము నిట్లు రచించెను.

## వ్యాస విరచిత కాశ్యష్టక స్తోత్రము

౧. స్వర్గత స్సుఖకరీ దివౌకసాం, శైలరాజ తనయాతివల్లభాం।
ఢుంఢిభైరవ విదారితవిఘ్నా, విశ్వనాథ నగరీ గరీయసీ॥

౨. యత్ర దేహ పతనేన దేహినాం, ముక్తిరేవ భవతీతినిశ్చితమ్।
పూర్వపుణ్య నిచయేన లభ్యతే, విశ్వనాథ నగరీ గరీయసీ॥

౩. సర్వదామర గణైశ్చవందితా, యాగజేంద్రముఖవారితవిఘ్నా
కాలభైరవ కృతైకశాసనా, విశ్వనాథ నగరీ గరీయసీ॥

౪. యత్రతీర్థమనులామణికర్ణిక, యాసదాశివసుఖప్రదాయినీ
యాశివేన రచితా నిజాయుధైర్విశ్వనాథ నగరీగరీయసీ॥

౫. సర్వార్థకృత మజ్జనపుణ్యై, ర్జన్మజన్మ సుకృతైఃఖలు లభ్యా।
ప్రాప్యతే భవ భవార్తినాశనీ, విశ్వనాథ నగరీ గరీయసీ॥

౬. యత్రముక్తిరఖిలైస్తుజంతుభి, ర్లభ్యతేమరణ మాత్రతస్సదా
సాఖిలామర గణైశ్చవందితా, విశ్వనాథ నగరీ గరీయసీ॥

౭. యత్రశక్రనగరీ తసీయసీ, యత్రధాతృ నగరీకనీయసీ।
యత్రకేశవ పురీలఘీయసే విశ్వనాథ నగరీ గరీయసీ॥

౮. యత్రవేద తటినీప్రథీయసే యత్రవిశ్వ జననీ పటీయసీ।
యత్రభైరవ కృతర్పనీయసే, విశ్వనాథ నగరీగరీయసీ॥

౯. విశ్వనాథ నగరీస్తవంశుభం, యఃపఠేత్ప్రియతమానస్సదా।
పుత్ర దార గృహలాభమవ్యయం,
ముక్తిమార్గ మనఘం లభేత్సదా॥

వ్యాసుండీ కాశ్యష్టక స్తోత్రముచే శివానుగ్రహముంబడ సెను. గంగానదిలో నందికేశ్వరునిచే స్థంభీభూతంబైన హస్త మప్పటికప్పుడే ఎప్పటియట్లు వ్యాసమహాసీంద్రున కావిశ్వనాథుం

డనుగ్రహించి; అష్టాదశ పురాణ రచనంబీఘట్టంబు నందొనర్చి సత్కీర్తింగడింతువుగాక యని యాశీర్వదించుటగల్గినది.

వ్యాస విరచితాష్టాదశ పురాణంబులు సంస్కృతభాష యందే గల్గియున్నవి. వాని నాంధ్రీకరించిన మహనీయులును గలరు. అందందు (శ్రీ) మల్లేశ్వరమహాత్మ్యము మనకు గోచరించుచునే యున్నది.

కీ॥ శే॥ కింకవీంద్ర ఘటాపంచానన నేత్యాది బిరుదాంకితులగు తిరుపతి వేంకట కవీంద్రాంధ్రీకృత "శివ పురాణము" అత్యంత ప్రశస్తి గడించుటచే యందలి శివలింగ నిర్మాణములను గూర్చినంతవరకిట నుదాహరించు చున్నాను.

## బ్రహ్మదు లిష్టసిద్ధికై లింగార్చనం బొనర్చుట

సూతుండు శౌనకాది మహామునులకిట్లనియె. "బ్రహ్మ, సమస్త దేవతాగణములతో నారాయణమూర్తి సన్నిధికేగి యిట్లు ప్రార్థించుచున్నాఁడు. మహాత్మా! నిరంతరము నెవ్వని పూజించుటచే సకల దుఃఖములు హరించునో, మాకును; సమస్త దేవతలకును, నియమిత సేవ్యుండగు దేవుండెవ్వండో యనుగ్రహించి మా కుపదేశింపుము; అనుటయు నారాయణుండిట్లనియెను. ఓ బ్రహ్మ! సావధానుండవై వినుము. ఎవ్వరు

గాని తమ యిష్టార్థసిద్ధిం గోరువారెల్లరు నిరంతరము నిశ్చల భక్తితో శివునిపూజ గావింపవలయును. దేవతలైనను, దానవులైనను, మనజులైనను శివుని పూజాబలమువనే మనోరథసిద్ధిని బడవలయును. ఓ విధాతా! అభీప్సిత సిద్ధికొరకు నీవు శివారాధనము గావింపుము దేవతాలారా! మీరుగూడ నమ్మహేశ్వరుని పూజింపుడు. అన్యదైవములను విశ్వసింపకుడు. ఒక్కక్షణంబైనను శివస్మరణంబు గావింపనివానికి హానియు, దైన్యమును, నజ్ఞానమును, నధర్మమును సిద్ధింపగలవు. శివభక్తిపరాయణులును, శివధ్యాన చిత్తులును, శివస్మరణ తత్పరులును నగు వారెన్నటికి దుఃఖభాజనులు కాజాలరు. అట్టివారికి రమణీయ సౌధములును, వివిధామూల్యాభరణములును, గుణవతులగు సతులును, శరీరారోగ్య గౌరవంబులును, లోకమున నసమాన ప్రతిష్ఠయు, స్వర్గాది భోగములును, మోక్షంబు మొదలైన నిష్టసిద్ధులు లభింపగలవు. శివపూజాతత్పరుండెన్నటికి పాపపంకిల నిమగ్నుడు కాజాలడు అని నం బరమేష్ఠి ఆ శివస్వరూపంబు లెవ్వరెట్లు నిరూపించుకొననగునెనుటయు నారాయణమూర్తి విశ్వకర్మ నుద్దేశించి శివలింగమూర్తుల నెవ్వరికెట్లు ప్రసాదింపనగునో నట్లనుగ్రహింప వేయుని కోరెను.

"విశ్వకర్మయు శివలింగములను నిర్మించి యధికారాను సారముగ నింద్రునకు పద్మరాగమయ లింగంబును, గుబేరునకు గనకకలితంబగు లింగంబును యమునకు గోమేధికమయ లింగంబును వరుణునకు గారుత్మత మణిమయలింగంబును విష్ణువున కింద్రనీలమయ లింగంబును బ్రహ్మకు హేమమయ లింగంబును,విశ్వ దేవతలకు వసువులకు మృణ్మయలింగంబులును లక్ష్మికి స్పటికమయ లింగంబును, ఆదిత్యులకు తామ్రమయ లింగంబును, జంద్రునకు మౌక్తికమయ లింగంబును విభావసునకు వజ్రమయ లింగంబును, ననంతాది నాగేంద్రంబులకు బ్రవాళ మయలింగంబులును మహాబలులగు దైత్యదానవులకు గోమయ లింగంబులును నిశాచరంబులకు లోహమయ లింగంబులను, బార్వతికి నవనీతమయ లింగంబును, నైరృతికి దారుమయలింగంబును, యోగులకు భస్మమయ లింగంబులును, సూర్యపత్నియగు ఛాయాదేవికి పిష్టమయ లింగంబును, బ్రహ్మణియగు వాణికి రత్నమయ లింగంబును, యక్షులకు దధిమయ లింగంబులును బ్రసాదించెను. విశ్వహిత కరుండగు విశ్వకర్మచే నట్లు సంప్రాప్తంబులైన శివలింగంబులను వారు పరిగ్రహించి బ్రహ్మాది దేవతలు మొదలైన వారెల్లరును నప్పటి నుండి యిష్టసిద్ధికై నిరంతరము శివారాధనము గావింప దొడంగిరి" (శివపురాణం 104 పుట)

# శిలామయ లింగమూర్తి ప్రాధాన్యత

మానవ లోకంబునకు శిలామయ లింగమూర్తులనే ప్రసాదించి యున్నట్లూహింప నగును. శ్రీ మల్లేశ్వరాలయము నందేగాక; శ్రీశైలమున, లింగాల ఘట్టమునందీ యంశము ద్యోతకంబగుచున్నది.

"కాశీఖండము" సప్తమాశ్వాసమునందలి శివలింగముల వర్ణన పద్యంబులు సాదృశ్యంబుగ నిందుదాహరించు చున్నాను.

"గీ॥ ఒక్క పేరి లింగంబులు ♦ పెక్కుగలవు,...॥ (165)

"గీ॥ కలుగ నీకాశి శంభు లిం ♦ గములుకోట్లు,
విశ్వనాథుండు లింగంబు ♦ శాశ్వతుండు..." (168)

"సీ॥ కాశి శివలింగకోటులం ♦ గన్నతల్లి।
కాశికైవల్య ఫలదాయి ♦ కల్పవల్లి।
గంగ గారాబు నెచ్చెలి ♦ కర్తకాశి।
సురనరోరగ దైత్యసం ♦ స్తుత్యకాశి॥ (కా॥ ఖ॥176 పుట

కాశీ, విశ్వేశ్వర "లింగ"నిలయంబై "శివలింగకోట్ల"కు ఘనియగుటచేతనే "కైవల్యఫలదాయి" యన నొప్పియున్నది. ఒక్క – "ఒక్కపేర" పెక్కులింగంబులట గల్గియున్నవనుటలో ఆయాలింగంబుల సంఖ్య గణనాతీతంబనక తప్పదు. మఱియు

"అగ్నిపురాణము" 38వ యధ్యాయంబున శిలామయ లింగమూర్తిలోనర్పుటచే గల్గు పుణ్యముం గూర్చిన శ్లోకంబులిట గమనార్హంబగుట నుదాహృతంబగుచున్నవి.

శ్లో॥ శివబ్రహ్మార్క విఘ్నేశ చండీ లక్ష్మ్యాదికాత్మనాం।
దేవాలయకృతేః పుణ్యం ప్రతిమాకరణేధికం॥

శ్లో॥ ప్రతిమాస్థాపనే యాగే ఫలస్యాంతో నవిద్యతే।
మృణ్మయాద్దారుజే పుణ్యం దారుజాదిష్టకాభవేత్॥

శ్లో॥ ఇష్టకోద్ధాచ్ఛైలజేస్యాద్ధేమాదేరధికంఫలం।
సప్తజన్మకృతం పాపం ప్రారంభాదేవనశ్యతి॥ అ॥ 38 ఆ॥

శివ, బ్రహ్మ, సూర్య, గణపతి, చండిక, లక్ష్మి మొదలైన దేవాలయములు గట్టుటచే పుణ్యఫలప్రాప్తి కగును. శివలింగాది మూర్తులు మృత్తిక, దారువులచే నొనర్పుటకన్న హేమ, లోహ, శిలలతో గావించుట అత్యధిక పుణ్యసంప్రాప్తి కలుగునని తెలుపంబడినది. అంతేగాక ఏడుజన్మలనుండిగల పాపంబంతయు నిందువలన హరింపంబడగలదనినిర్వచింపంబడెను. కావున నీ మహామహిమాన్విత మల్లేశ్వర శిలామయ లింగమును; ఈ దేవాలయమును నిర్మించిన మనీయులయొక్క పుణ్యముంగూర్చి విశేషించి తెలుపకయే తెలియంగల్గుచున్నది.

శ్రీ కాకాని మల్లేశ్వరాలయ ప్రదక్షిణాదులచే పరిపూతులగువారును, అనుదినము రుద్రాభిషేకంబు లొనర్పించుచు

మొక్కులు చెల్లించువారును పెక్కురిందు గానంబడు చుందురు.

కైలాసవాసియైన పరమశివుండె పుడమి మానవానీకం బునుద్ధరింప నీ శిలామయ లింగంబునందా విర్భూతుండైయున్న ట్లెరుంగనగును. అటువలెనే పార్వతీదేవియు నిట భ్రమరాంబా దేవి స్వరూపంబున మూర్తీభవించి మనల నెల్లర ననేక విధంబుల కటాక్షింపగల్గుచున్నది. ఇట్లే పలు ప్రదేశంబుల, పలునామంబులచే పార్వతీదేవి ప్రభవించియున్నట్లు 'ఫలశ్రుతి' తో గల శ్లోకంబులు పాఠకులకొఱకిట నుదాహరించుచున్నాను.

## ద్వాత్రింశపీఠంబులం బార్వతీదేవి ప్రతిభ

శ్లో॥ లంకాయాం శాంకరీదేవీ, కామాక్షీ కంచికాపురీ।
ప్రద్యుమ్నే సింహళద్వీపే, చాముండీ క్రౌంచపట్టణే॥

౨ అలంపుర్యాం జోగులాంబా, శ్రీశైలే భ్రమరాంబికా।
కొల్లాపుర్యాం మహాలక్ష్మీ, మాహుర్యాం ఏకవీరికా॥

3. ఉజ్జయిన్యాం మహాకాళీ, పీఠాయాం పురుహూతికా।
ఓఢ్యాయాం గిరిజాదేవీ, మాణిక్యా ద్రాక్షవాటికే॥

౪ గయాయాం మాంగల్యగౌరీ, ప్రయాగే మాధవేశ్వరీ।
జ్వాలాయాం వైష్ణవీ దేవీ, అయక్షేత్రే కామరూపిణీ॥

౫. వారాణస్యాం విశాలాక్షీ, కాశ్మీరేచ సరస్వతీ।
హరిద్వారే మహామాయా, బ్రహ్మాండే భువనేశ్వరీ॥

౬. జ్వాలాద్రౌచ మహాజ్వాలా, బదర్యాం కాళరాత్రిణీ।
చిదంబరేచ సావిత్రీ, సాతే పర్వత వర్ధనీ॥

౭. ఏకాశితాంచదుహులరా, పట్టసే భద్రకాళికా।
గాయత్రి దేవీ కావేర్యాం, జగదంబా పుష్పగిరా॥

౮. హాల్యానగర్యాం మీనాక్షీ, ఇంద్రకీలాద్రౌచదుర్గా।
కేదారపురపీఠేచ మహిషాసుర మర్దనీ॥

౯. త్రిపురాంతక పీఠేచ దేవీ త్రిపురసుందరీ।
ద్వాత్రింశవరపీఠాని నిర్మితం విశ్వకర్మణా॥

౧౦. ఏతత్పీఠాధి దేవీశ్చ త్రిసంధ్యాయః పఠేన్నరాః
సర్వసంపత్ప్రదం శోభం సర్వకామంచ ప్రాప్నుయాత్॥

ఇంక శివసహస్రనామ పూజాఫలితముంగూర్చి సుప్రసిద్ధంబుగ శ్రీ కృష్ణుండు సుదర్శన చక్రంబును పొందినగాథ శివపురాణ ప్రథమభాగమునుండి ఇందుదాహరించుచున్నాను.

## శివ సహస్రనామ పూజా ఫలిత శ్రీకృష్ణ కథనము

"రాక్షసులు సకలలోకంబుల కధీశ్వరులై సురలను నిర్బంధించుచుండుట ఎఱింగి శ్రీకృష్ణుండు వారింబరి మార్పందగు వస్త్రమును శంకరునివలన గైకొననెంచి భక్తియుక్తంబుగ

సహస్రకమలములను సిద్ధపరచుకొని ఒక్కొక్క కమలము, నొక్కొక్క నామము నుచ్చరించుచు శివుని పూజించుచుండెను. అప్పు డతని భక్తిం బరీక్షింపందలంచి శంకరుండొక్క కమలమును అదృశ్యమగు నట్లొనర్చెను. శ్రీ కృష్ణుండా మాయావిశేషము నెఱుంగనేరక - చివరకొక్క కమలము సహస్ర సంఖ్యలో లోపించుటంగని తత్క్షణంబా శివనామోచ్చారణము నాప నోపక (పద్మపత్రాక్షుండగుట) తన నయన కమలమునే పెకల్చి యర్పింప సమకట్టెను. అప్పుడు సదాశివుండు శ్రీకృష్ణుని నిశ్చలభక్తికిమెచ్చి ప్రత్యక్షంబై "ఓ కృష్ణా! నీవు నిశ్చల భక్తితో గావించిన సహస్రనామ పూజకు మిక్కిలి తుష్టికలిగినది. నీ భక్తిని పరిశీలించుటకై ఒక పుష్పము నగోచరమొనర్చితిని; చూడుమనగనే ఆ కమలము తన కరమునందే గల్గినది. అందుకు కృష్ణుండు పరమానంద భరితుండై "సమస్తకిల్బిషాపహారుండవగు ఓ శంకరా! పాప భయంకరా! దేవాదిదేవా! మహాదేవా! నీ నెఱుంగని దిసుమంతయు లేదుగదా! దానవాదులను సంహరించుటకు తగిన యస్త్రంబొక్కటి నాకు గలుగనందున దాని నర్థించి తమ శరణంబు గోరుచున్నాను. అని, ఆ పరమశివునకు శ్రీకృష్ణుండు ప్రణమిల్లి నిలువంబడియెను. అందుకు భక్తలోకవశంకరుండగు శంకరుండత్యంతానందముతో "ఓ కృష్ణా! సుదర్శన చక్రంబిదే

అనుగ్రహించితిని గైకొనుమ”ని దగద్ధగాయమానముగా వెల్గు చున్నట్టి సుదర్శన చక్రంబును ప్రసాదించెను.

శివానుగ్రహామువలన లభించిన సుదర్శన చక్రమును శ్రీకృష్ణ భగవానుండు తన శత్రుసంహారంబునకై ప్రయోగించుచు జయము నొందగల్గెను. ఈ శివసహస్రనామ పూజ బ్రహ్మాదులెల్లరు చేయుచున్నదే గావున మనము మన యభీష్ట సిద్ధ్యర్థము శివసహస్రనామపూజ – కనీసము శివాష్టోత్తర శత నామపూజనైనను గావించి సఫలీకృతులమయ్యెదము గాక.

శ్లో॥ నమశ్శివాయ రుద్రాయ, భవాయ, పరమేష్ఠినే।
దేవాయ దేవనాథాయ, జ్యోతిషాంపతయేనమః॥

మంగళకరుండైనట్టియు ప్రపంచ సృష్టి, స్థితి, లయాదులకు కారణుండైనట్టియు, దేవుండై సర్వ దేవతల ప్రభువైనట్టియు జ్యోతిష్పతియైన ఓ మల్లేశ్వరా! నీకనేక నమస్కారములు.

## మల్లేశ్వరలీల; కలలంగల స్వరూప దర్శనము

మల్లేశ్వరస్వామి; భక్తుల కలలందు దర్శనంబొసంగి; యిష్టకామ్యార్థంబుల; ఫలమో. పుష్పమోయొసంగుట పరిపాటిగ నున్నది. కావున నీ స్వామికి “ఏకరాత్రి ప్రసన్న” యను బిరుదము సార్థకంబుగ నుండెను. ఈ శివలీలా సందర్శనములను గుర్తించుట అందరికినీ సాధ్యంబైన పనికాదు. అందుచే

పూర్వము అష్టదిగ్గజంబులు నాబరగిన కవులలో నొక్కం
డైన కందుకూరి రుద్రకవి తన కలలో శంకరుండు గోచరించిన
రీతి "నిరంకుశోపాఖ్యాన" పీఠికలో నిట్లు వర్ణించి యుండెను
గావున నిట నుదాహృతము.

సీ॥ శార్దూలచర్మమో ♦ జాళువాచేలయో
        కాని నిద్దపుమేన ♦ గట్టినాఁడు,
    కమనీయ భస్మమో ♦ గంధచూర్ణముకాని
        వాసనల్ వెదజల్ల ♦ బూసినాఁడు,
    ధవళభుజంగమో ♦ తారహారముకాని
        మృదుతరగ్రీవ ధ ♦ రించినాఁడు,
    తతజటాజూటమో ♦ ధమ్మిల్లమోకాని
        పొలుపార నొదలఁ ♦ బూనినాఁడు.

తే॥ చంద్రఖండంబొ పుష్పగు ♦ చ్ఛంబొకాని,
    మూర్ధసీమనతిప్రేమ ♦ ముడిచినాఁడు,
    జంగమొక్కఁడు నిద్రితా ♦ నంగమూర్తి,
    నిదురవోవంగవచ్చినా ♦ యెదురనిల్చె. (ని॥ పీ॥ 12)

రుద్రకవి తన నిదురలోగనిన జంగమును పరమేశ్వరుండే
యని గుఱుతించి సంస్తుతించి కృతిపతిం జేసి యిష్టసిద్ధింబడసెను.
అటులనే మన కలయందైనను, ఇలయందైనను, మనమందైనను

గోచరించు శ్రీ మల్లేశ్వరలీలామాత్ర సందర్శనంబున నేనిగుఱుతించి సేవించి సుఫలావాప్తి నొందెదముగాక. సాధారణంబుగా శివనామోచ్చారణం బెల్లయెడల క్షేమంబు గూర్చెడినని యెఱుంగనగును.

## అప్రయత్న శివ నామోచ్చారణ ఫలిత కథనము

మనస్ఫూర్తిగగాక అప్రయత్నంబుగశివనామోచ్చారణ గావించిన ఒకానొక మహాపాపికి శివకటాక్షము; కైవల్యము గల్గిన పురాణోక్తకథనంబిటనుదాహరించుచున్నాను.

సూతుండు శౌనకాది మహామునుల కెఱింగించిన విధం బేమనః పూర్వముప్రతిష్ఠానమను పట్టణమును ఇంద్రసేనుండను రాజేలుచుండెను. అతండు, జీవహింసకుడు. పరస్త్రీ, పరధన, వస్తువాహనములనపహరించుట; సురాపానంబొనర్చుట అతని ముఖ్యకృత్యములు. వానిసహచరులుకూడ నతనికట్లేతోడ్పడు చుండువారు.ఇతండుఅప్రయత్నముగా'శివశివా''యనివాక్రుచ్చు నలవాటుమాత్రముగలిగి యనేక ఘోరకృత్యములొనర్చి తుదకుమరణించెను.అపుడతని యాతనాశరీరమును యమకింకరులు గొనిపోయి యమధర్మరాజుముందునిలిపిరి.ఆతండొనర్చియున్న పాపములకు దగినశిక్షలొనర్ప ప్రారంభించిరి.ఇంతలో కైలాసంబునుండి శివదూతలు యమలోకంబునకువచ్చిఇంద్రసేన మహారాజునుజూచి''కింకరులారా! మీరుతప్పుపనిచేసితిరి,ఈయింద్రసేనునిట కేలగొనివచ్చితిరి.ఇతనివిషయములో మాప్రభువుగా

రైనపరమశివుండు దివ్యదృష్టింబారజూచి తత్క్షణమే తోడి తెండని యమ్మిచటికిపంపెను గానతత్క్షణమె యింద్రసేనునివిడువుడు. ఆయనకొఱకై అల్ల దేవపుష్పవిమానంబుసిద్ధముగానున్నది "అని పలికిరి అపుడు యమధర్మరాజు తెల్లమొగము వేసి చిత్రగుప్తుని వైపు మెఱమెఱజూచెను. చిత్రగుప్తుఁడు తహతహలాడుచు చిత్తానుతిరుగపరామర్శగాజూడగా ఒక్కవిషయంబునందుమాత్రమింద్రసేనునకు కైవల్యపదప్రాప్తి లిఖింపంబడియుండుట గనంబడియెను. అదియప్రయత్నముగనైన నాయింద్రసేనుండు "శివ, శివ"యనునుచ్చారణ మొనర్చినమాత్రమునగల్గిన సత్ఫలితమేయని తెలియనయ్యెను. ఆసత్ఫలితముచేత నతండెన్ని పాపకృత్యములొనర్చినను పుణ్యాత్ముఁడుగనే పరివర్తనముపొందెను. యమధర్మరాజుగాని, యమకింకరులుగాని ఆయింద్రసేనునేమి చేయజాలక క్షమాపణంబుగోరి పుష్పవిమానంబులోనెక్కించి కైలాసంబునకుబంపిరి.ఇంద్రసేనుఁడు శివసాయుజ్యమునొంది పరిపూతుండయ్యెను."

చూచితిరిగదా శివనామోచ్చారణఫలితమును! అప్రయత్నముగనొనర్చిన శివస్మరణకే యింతఫలితంబుండినప్పుడు మనమిప్పుడు భక్తిశ్రద్ధలతో నొనర్చుశ్రీమల్లేశ్వరస్వరూప శివనామస్మరణ, ధ్యానాదులకెంతటిసత్ఫలితంబుండునో ఎల్లవారుగ్రహింతురుగాక. పూర్వజన్మకృతంబుంగూర్చి ఆన్నమార్యకృత "సర్వేశ్వరశతకం"బునుండి రెండుపద్యంబులిటనుదాహరించుచుంటిని.

మ॥ కలవారై మతిమంతులై రసికులై గంభీరులై ధీరులై
లలనా మన్మథులై సముజ్జ్వలవచోలాలిత్యులై
బలవిభ్రాజితులై యశోభరితులై భాసిల్లు భాగ్యోదయుల్
తొలిజన్మంబుననిన్ను గొల్చినమహాత్ముల్ వారుసర్వేశ్వరా!

మ॥ ఖలులున్ యాచకులున్ విరుద్ధవికటాకారాంగులున్ పంగులున్
బలహీనాతురులున్ రుజాపటలతాపచ్ఛన్నులున్ ఖిన్నులున్
చలనాందోళితచిత్తులున్ మలినులున్ జాత్యంధులున్ మందులున్
తొలిజన్మంబులనిన్నుఁగొల్వనిదురాత్ముల్ వారుసర్వేశ్వరా!

ఇంక నీసర్వేశ్వరుండైనమల్లేశ్వరస్వామిని స్తుతించుటకై ఒక్కపద్యం బీక్రిందంబొందుపఱచుచున్నాను.

శా॥ శ్రీకంఠాయ నమోనమో నతసుర శ్రేష్ఠాయరుద్రాయ లిం
గాకారాయనమోనమోవిగత సంసారాయశాంతాయ చం
ద్రాకల్పాయ నమోనమో దురితసంసారాయ తేయంచు ని
న్నాకాంక్షంబ్రణుతించుమానవుఁడునీవైయుండుసర్వేశ్వరా!

# భ్రమరాంబా మల్లేశ్వర ప్రబోధములు

పురాణదంపతులైన శ్రీభ్రమరాంబామల్లేశ్వరులులోకో ద్ధరణార్థమై ప్రభోధించినట్లుగల తృతీయాధ్యాయ "గురుగీత" శ్లోకంబుల, నెఱుంగుదుముగాక.

శ్లో॥ ధ్యానంశ్శృణు మహాదేవి సర్వానంద దాయకం।
సర్వసౌఖ్యకరంచైవ భుక్తిముక్తి ప్రదాయకం॥ (గు॥తృ॥95)

ఓ పార్వతీదేవీ! ఆనందదాయకం బైనదియు, సమస్త సౌఖ్యంబుల నొసంగునదియు, భుక్తి; ముక్తినిచ్చునదియు నగు నాత్మధ్యానము చెప్పుచున్నాను; అని గురుతర విశేషంబులను జెప్పి మఱియు నాపరమేశ్వరుండిట్లనుచున్నాడు.

శ్లో॥ ఇదమేవశివం ఇదమేవశివం ఇదమేవశివం। ఇదమేవశివం।
మమశాసనతో మమశాసనతో మమశాసనతో మమశాసనతః॥

నాశాసనము మంగళమైనది, నాశాసనము మంగకరమైనది, నాశాసనము మంగళప్రదమైనది నాయాజ్ఞయే మంగళమొసంగునదియని పలుమరునిర్వచించిన విని పార్వతీదేవి.

శ్లో॥ నతాస్మితేనాథ పదారవిందం।
బుద్ధీంద్రియ ప్రాణమనోవచోభిః।
యచ్చిన్త్యతే భావిత మాత్మయుక్తౌ।
ముముక్షుభిః కర్మమయోపశాంతయె (గు॥తృ॥ 184)

మోక్షేచ్చచే ఆత్మస్వరూపముయొక్క కలయికయందు కర్మశాంతికొఱకు ఏభగవత్పాదారవిందంబులు ధ్యానింపంబడు చుండునో అట్టినీపాదారవిందంబులకు బుద్ధీంద్రియ ప్రాణమనో

వాక్కాయకర్మలచే నమస్కరించుచున్నాను. అనిపార్వతీదేవి పలుకగా సదాశివుండిట్లనుచున్నాఁడు.

శ్లో॥ అత్యంతం చిత్తపక్వస్య శ్రద్ధాభక్తియుతస్యచ।
ప్రవక్తవ్యమిదం దేవి, మమాత్మాప్రీతయేసదా॥ (శ్లో॥253)

ఓ పార్వతీదేవి! ఇదిమిక్కిలిమనః పరిపక్వతగలిగి శ్రద్ధాభక్తులతో గూడినవారికి నామనస్సంతోషముకొఱకు మిక్కిలి చెప్పందగినది.

శ్లో॥ సచ్చిదానందరూపాయ వ్యాపినేపరమాత్మనే।
నమశ్శ్రీగురునాథాయ ప్రకాశానందమూర్తయే॥ (254)

ఓ దేవీ! సచ్చిదానందస్వరూపుఁడును; అంతటవ్యాపించియుండెడువాఁడును, ప్రకాశమానంబగు సంతోషమేరూపముగాగలవాఁడును; పరమాత్మస్వరూపుడును నగు గురునాథుఁడే నాయొక్క ప్రతిబింబము; గాన నట్లుతలంచి నమస్కరింపవలయును. అనివచించిన శంకరునితో పార్వతీదేవియిట్లనుచున్నది.

శ్లో॥ నమస్తేనాథభగవన్ శివాయగురురూపిణే।
విద్యావతారసంసిద్ధ్యై స్వీకృతానేకవిగ్రహ॥

ఓస్వామీ! జ్ఞానావతారముగా సంసిద్ధికొఱకనేక రూపములతోనున్ననీకు నమస్కారము. మంగళకరుండవును, గురు

స్వరూపియునగునోనాథా! నీకునమస్కారము అనియుజియు,నీవు నవీనుండవును- సుస్వరూపుండవును, ముఖ్యముగ పరమాత్మ స్వరూపుడవును, సమస్తఅజ్ఞానాంధకారమునడంప భాస్కర స్వరూపివియు స్వతంత్రుఁడవును, కరుణామయాకారముగల వాడవును, పరమేశ్వరుండవును, తేజోమయులకు తేజస్వరూపుం డవును. జ్ఞానులకు జ్ఞానస్వరూపుండవునునగుసద్గురుస్వరూపమున ప్రసన్నుఁడవగునీకునానమస్కారములు అనిశివ్యభావోపేతయై పార్వతీదేవి ప్రణుతించుట మూలమున మనకు ప్రభోధించినట్లు గలదు. అట్టి సదాశివునామ సంకీర్తనాదుల ఫలశ్రుతినీ క్రింద గనంబరచెను.

# శివనామసంకీర్తనఫలశ్రుతి

శ్లో॥ నామసంకీర్తనేధ్యానే సర్వపవాధికారణః. . . (శి॥గీ)

శ్రీమల్లేశ్వరనామ సంకీర్తనంబొనర్చుటకు అందఱునధి కారులేయనియజియు.

శ్లో॥ సర్వం శాంతికరం నిత్యం తథాసంధ్యా సుపుత్రకం।
అవైధవ్యకరం స్త్రీణాం సౌభాగ్యస్య వివర్ధనం॥ (గు॥గీ॥)

ఈనామసంకీర్తనవలన సర్వవిధముల శాంతికలుగును. స్త్రీలకు గొడ్రాలితనము హరింపంబడి మంచి సంతానము కలుగును. జాతకరీత్యా వైధవ్యమున్నను నట్టివైధవ్యప్రాప్తి నడ్డ గించి జీవితపర్యంతము సుమంగలీత్వముంబ్రసాదించును. అంతే గాక ఆబాల గోపాలమునకు సుగమముగ

శ్లో॥ ఆయురారోగ్యమైశ్వర్యం పుత్రపౌత్రప్రవర్ధనం|...(గు॥గీ.)

శ్లో॥ కామ్యానాం కామధేనుర్వై కల్ప్యతే కల్పపాదపః
చింతామణిశ్చింతితస్య సర్వమంగళకారకం॥ (గు॥గీ॥)

"ఓంనమశ్శివాయ" అనుమూలమంత్ర జపమొనర్చిన వారికింగల్గు ఫలితాంశంబులిక్రింది శ్లోకంబున వివరించుట గల్గినది. చూ॥

శ్లో॥ ముఖస్తంభకరంచైవ గుణానాంచ వివర్ధనం|
దుష్కర్మనాశకంచైవ తదాసత్కార్మసిద్ధిదం॥

శివపంచాక్షర జపంబొనర్చినవారి ముఖము తేజోవంతం బగుటచే ఎదిరిముఖమును స్తంభింపజేయగల్గియుండును. సుగుణములను వృద్ధిపరచును దుష్కర్మనాశకంబగును. సత్కార్యసిద్ధి కలుగును. ఇంకను;

శ్లో॥ అసిద్ధంసాధయేత్కార్యం నవగ్రహాభయాపహం|
దుస్స్వప్ననాశకంచైవ సుస్వప్నఫలదాయకం॥ (గు॥గీ॥)

అసాధ్యకార్యములు సయితము నెరవేరును. శనిమొదలైన నవగ్రహాదోషంబులుకూడనశించును. దుస్స్వప్నారిష్టములు లేక సుస్వప్నఫలితంబులనే పొందింపగల్గును, శ్రీమల్లేశ్వరాలయమునంప్రవేశించిన తోడనె శ్రీవీరభద్ర, భద్రకాళీసందర్శనం బగును. మఱియు విఘ్నేశ్వర శ్రీమల్లేశ్వర, భ్రమరాంబా

మూలవిరాట్ మూర్తుల సందర్శనంబగును. ముస్ముందు విఘ్నేశ్వరపూజాదికము లొనర్చుట కవసరంబగు నందుగూర్చి స్తోత్రాత్మక శ్లోకంబులిం దుదాహరించుచున్నాను.

## శ్రీ విఘ్నేశ్వర స్తోత్ర ఫలశ్రుతి

శ్లో॥ ప్రాతఃస్మరామి గణనాథ మనాథ బాంధుం,
సిందూర పూర్ణ పరిశోభిత గండ యుగ్మమ్,
ఉద్దండ విఘ్న పరిఖండన చండదండ,
మాఖండలాది సురనాయక బృందవంద్య. ౧.

శ్లో॥ ప్రాతర్భజామి చతురానన వంద్యమాన,
మిచ్ఛానుకూల మఖిలంచ వరందధానమ్,
తంతుందిలంద్విరసనాధిప యజ్ఞసూత్రమ్,
పుత్రం విలాసచతురం శివయోః శివాయ. ౨.

శ్లో॥ ప్రాతర్నమామి భయదంఖిలుభక్తశోక,
దావానలం గుణవిభుం నరకుంజరాస్యం,
అజ్ఞానకానన వినాశన హవ్యవాహ,
ముత్సాహవర్ధన మహంసుతమీశ్వరస్య. ౩.

శ్లో॥ శ్లోకత్రయమిదంపుణ్యాం సదాసామ్రాజ్యదాయకం,
ప్రాతరుత్థాయ సతతం ప్రపఠేత్ ప్రయతఃపుమామ్, ౪.

(శ్రీ వీరభద్రస్వామినింగూర్చి స్థలాంతరమునం గన నగును.)

7)

# శ్రీ మల్లేశ్వరస్వామి సందర్శనము

శ్రీ మల్లేశ్వరస్వామి దర్శనంబున నందీశ్వరు నీ క్రింది శ్లోకంబుచే సంస్మరింపవలెను.

శ్లో॥ నందీశ్వర నమస్తుభ్యం సాంబానంద ప్రదాయకం।
మహాదేవస్య సేవార్థం అనుజ్ఞాంధాతుమర్హసి॥

తదుపరి మల్లేశ్వర స్వామికి నమస్కారాదులొనరించి విభూతిని ధరింపనగును. ఈ క్షేత్రమాహాత్మ్యమునం గూర్చని బడిన దండకంబిట తీర్థయాత్రాపరుల పఠనార్థము సమర్పించు చున్నాను.

శ్రీ మన్మహాదేవ ! మల్లేశ్వరా ! సర్వభూతేశ్వరా! నీవు భక్తాళిసిన్ బ్రోవగా పెద్దకాశాని దివ్యాలయంబందు దేదీవ్యమానంబుగా వెల్గుచున్నావు; కారుణ్యమూర్తీ! భవచ్ఛక్తి నిన్ గాంచగా బ్రహ్మ విష్ణ్వింద్రులే చాలకుండంగ మేమెంత? భక్తి ప్రపత్తిం ప్రశస్తించి కీర్తించుచున్నారమో దేవ! రక్షించు దేవేశ! లోకంబులన్గావ కంఠంబునన్గాల కూటంబునున్నిల్పి గంగా భవానిన్ శిరంబందుకీలించి, శేషాహి, నాగాహి సద్భూషలుం గాగ సూర్యాగ్ని చంద్రుల్ త్రినేత్రంబులున్‌గాగ ముల్లోక ములేల్ పేర్మిమైనేలుచున్నావు గంధర్వ విద్యాధరాదిత్య దైత్యాది సందోహసేవ్యా! ముకుందప్రియా! చంద్రమౌళీ! హరా! అర్ధ

నారీశ్వరా! లింగ! దివ్యాంగ! నిన్ యోగులున్ రాజ రాజేం
ద్రులున్ గొల్చి కామ్యార్థముల్ పొందియున్నారు కాదే, శివా!
శర్వా! దాక్షాయణీనాథ! నీ నామమంత్రంబు మార్కండునిన్
బ్రోచె బళ్ళాణరాజేంద్రునిన్ గాచె బాపాటవీ భంజనంబౌట
కోట్లాది మర్త్యాళికెల్లప్పుడున్ దారకంబయ్యె; నీచేత కాకాని
భూలోకకైవల్యమేయయ్యె; దిగ్దేశ భక్తాళి దేదీప్యమానంబు
లైనట్టి దివ్యప్రభల్ కట్టి నందీశ్వరుంబోలు గోరాజవర్గంబులన్ గట్టి
రాజించి యూరూర నారీమణుల్ పూరుషుల్ వాకిలంబోసి
టెంకాయలన్ గొట్టి కర్పూర నీరాజనాదుల్ సమర్పింపగా నుత్స
వంబుల్ మజ్జికన్ మేళ తాళంబులున్ పెద్దబూరల్ ధ్వనింపంగ
ఖడ్గంబులున్ బాడగా నారసంబుల్ నెరన్ గ్రుచ్చి నృత్యంబులున్
సేయుచున్వచ్చి నీ యాలయంబందు నీ మ్రోలవీరంగ వాద్యం
బులున్భోరు కొల్వంగ వైవారముల్ చుట్టి కైదండముల్ చేసి నీ
రూపు దర్శించుచున్నాత్మలో నెంచి నందీశ్వరున్గొల్చి నీ పూజ
లన్ సల్పుచుండంగ అగ్నాలభావిన్ శిరస్నానముల్ చేసియున్
స్త్రీలు సంతానకాంక్షన్ విశేషంబుగా కోర్కె సాష్టాంగ దండ
ప్రణామంబులన్ చేయ భూతాదిదోషంబులన్ ద్రుక్కి మొక్కంగ
నవ్వారి పీడా పిశాచాది జాడ్యంబులన్ బాపి సంతానముల్
భోగ భాగ్యములున్ గూర్చి యారోగ్యవత్ప్రౌఢి సా చంద్ర
తారార్కమౌ ఖ్యాతి నార్జించి యున్నావు శ్రీ సాంబమూర్తీ!

భవద్భక్తులాదిత్యవారాన పొంగళ్ళు చెల్లించియు న్నారికేళం బులన్గొట్టి ధూపంబులన్వేయ నోంకార నాదంబు జేగంటలన్ గంటలన్ మ్రోయ; శంఖాలు పూరింప బాజార్లు బాజా భజం త్రీలచేమించి అంగళ్ళు, సావళ్ళు సత్రాలునిండన్ ప్రజల్ లెక్కకున్ మిక్కుటంబౌట నీధాత్రియే యీనినట్లెంతయో నేత్రపర్వంబుగానొప్ప, పౌరుల్ ముదంబంద భక్తుల్ భజింప ప్రసాదంబులన్బెట్టి సంతర్పణల్ చేసి జాగారముల్ సల్పి సంతో షమేపార శైలంబ గేహంబులన్ జేరు వారిన్ గటాక్షించుచు న్వాంఛలందీర్చు కామ్యార్థసంధాత! కైలాసశైలేశ! కాకాని సంవాస! మల్లీశ్వరస్వామి! మాకెప్డిష్టార్థసిద్ధిన్ బ్రసాదింపు సర్వేశ! నీ స్తోత్రముల్ సేయ సర్వేశ నభ్యున్నతుల్గల్గు శ్రీభద్ర కాళీ సమేతంబుగా వీరభద్రుండు, విఘ్నేశుండున్, దేవి; శ్రీ ఆంజనేయుండు, నాగేంద్రులున్గల్గి భాసించు; శ్రీ వో.సు. శర్మ న్గటాక్షించు ఓంకారమూర్తీ! చిదానందమూర్తీ! సదాలింగ మూర్తీ! కృపంజూచి రక్షించుదేవా! శివా! శంకరా! ఓం నమస్తే! నమస్తే, నమః

"శివపూజావిధి" "ప్రభాతస్తోత్రము" నిదివఱకే ప్రచురించి యుంటిని. శివసహస్రనామ స్తోత్రము నామావళి, అష్టోత్తరశత నామావళి సహితపాత్రములచే శ్రీభ్రమరాంబా మల్లేశ్వరులను యథావిధి పూజింపం జేయవచ్చును. అందుంగూర్చి ధ్యాన శ్లోకంబులనిట బ్రకటించుచున్నాను.

శాంతం పద్మాసనస్థం శశధరమకుటం పంచవక్త్రం త్రినేత్రం
శూలం వజ్రంచఖడ్గం పరశు మభయదం దక్షబాగేవహంతం
నాగంపాశంచ ఘంటాంప్రళయహుతవహంసాంకుశంవామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం పార్వతీశం నమామి.

వందేశంభుముమాపతిం సురగురుం వందేజగత్కారణం
వందేపన్నగభూషణం మృగధరం వందేపశూనాం పతిం
వందే సూర్యశశాంక వహ్నినయనం వందేముకుంద ప్రియం
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరం.

వాగర్థా వివసంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే ।
జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ ॥

## శ్రీకృష్ణుండుపాండవులకుశివారాధనశరణ్యంబనుట

పూర్వము పాండవులు వనవాస క్లేశంబునంజిక్కి పరిత పించుతఱి శ్రీ కృష్ణుండు వారలకు శివారాధనమే శరణ్యంబని యుపదేశించినక్రమ మిటుగాంచనగును.

"నేనొకప్పుడు ఉపమన్యునిచే నుపదేశమునొంది నటు వంటి శివారాధన ఫలితముగ నప్పరమేశ్వరుండు ప్రసన్నుండై వలసిన వరంబులొసంగి వటుపర్వత గుహాం ప్రవేశించెను.

నే నా మల్లికేశ్వరుని వరప్రసాదంబునం బొందిన సుదర్శన చక్రము మొదలైన వానిచే నెల్లజయంబులు, భోగ భాగ్యంబుల ననుభవించు చున్నాడను. మీ రీ దుఃఖంబును జయింపవలెనన్న శివారాధనంబు గావింపవలయును, అందు వలన సర్వశుభంబులు మీకు కరతలామలకంబగునని బోధించి ఆ యశోదా తనయుండు ద్వారకకుం జనియెను.

అప్పుడే వ్యాసమునీంద్రుండేతేర పాండవులతనింబూజించి తమ కష్టంబులను గూర్చి యిట్లు నుడివిరి. ఓ పితామహా ! మీ దర్శనంబువలన మేము ధన్యాత్ములమైతిమి. సుయోధ నాదులు అనేక కష్టంబులను కల్గించిరి ఆ దుఃఖంబంతయు మీ దర్శన భాగ్యంబున నుపశమించినది. అనగనే వ్యాసుండు వారితో నిట్లు ప్రబోధించుచున్నాడు.

ఓ సద్గుణులారా ! నేను అనుభవైక వేద్యముగా శివ మహాత్వంబెఱింగి ఆ మహాదేవునే ఆరాధించు చున్నాను. మీకు కష్టములనుండి కడతేరవలెనన్న ఆ పరమశివుని పూజించుటకన్న వేఱుదారిలేదు. ఆ శంకరుండే మీకు సమస్తశుభంబుల నొసంగగలఁడు. అని వచించి అర్జునుద్దేశించి ఓ కిరీటీ ! పిపీలికాది బ్రహ్మ పర్యంతము శివస్వరూపంబేయని యెఱుంగుము. దృశ్యా దృశ్య సర్వప్రపంచము శివాకృతియే యని విశ్వసింపుము. శివుండెల్లరకు బూజనీయుండు. విష్ణుండు

శంకర రూపాంతరుండేయైనను అతండు బహూకాలంబునకుం గాని ప్రసన్నుండు కాజాలడు. శంకరుండు భక్తవశంకరుండు, కించిత్కాల సేవకే మెచ్చి భక్తున కఖిలభోగంబుల నొసంగ సమర్థుండు కావున భోగమోక్షకాములగు వారెల్లప్పుడు శివపూజనంబు గావింపవలయును. అని సుస్నాతుంగావించి ఫల్గునకు పార్థివలింగేశ్వర పూజావిధి నుపదేశించెను. మఱియు;

నీవు ప్రశాంతస్థలంబైన యింద్రకీల పర్వతంబుపై శివునింగూర్చి తపంబొనర్పుము. శస్త్రాస్త్రముల నేమరక దగ్గరనుంచుకొనుము. తపోవిఘ్నకారు లేరైనంగల్గుచో వారి నుక్కడంచి మఱి తపం బొనర్పవలయును. ఇందుకు "గోపనియం" బను మహావిద్య ననుగ్రహించెదను. అని ఆ విద్య నెఱింగించి పాండవులనందరి నాశీర్వదించి; ఓ ప్రియకుమారులారా! శివునివలన మీ యభీష్ట సిద్ధియగును నే చెప్పిన చొప్పున ప్రవర్తింపుడని యా బాదరాయణుండు తన స్వస్థానంబున కేతెంచెను. శ్రీకృష్ణుండును శివారాధనమె శరణ్యంబని చెప్పియుండుటచే పాండవులు తమలో అర్జునుండే యందుకు తగినవాడని యెన్నుకొని యింద్రకీలాద్రిపై తపంబొనర్ప నాతనింబంపిరి; గాని ఆ యడబాటు సహింపనేరక ద్రౌపతీ, ధర్మరాజు, భీమ, నకుల, సహదేవులు కడుచింతింపందొడంగిరి.

అప్పుడు వ్యాసమహర్షిని వారు దర్శించి మహాత్మా! మేము కడుంగడు దుఃఖాతిరేకంబున గ్రుళ్ళుచున్నాము. కాల యాపన నిమిత్తమేదేని కథం జెప్పుదురుగాక, యని ఆశించు చున్నాము అనిన నందు కతండంగీకరించి–

ఓ ధర్మరాజా! పూర్వము, నలుండు హరిశ్చంద్రుండు, శ్రీరామ భద్రుండు మొదలగువారు పడిన కష్టంబులకన్న మీరిప్పుడు పడు కష్టంబు లెక్కుడువికావు. "జన్మ నాజా యతే దుఃఖం" బని యెఱుంగరే? మానవుఁడు దుఃఖము తోడనే పుట్టుచున్నాడు. ఆ దుఃఖము దేహధారణంబుతోడ గల్గినదేకాని మధ్యగల్గినదికాదు. బాల్య, యౌవన, కౌమార, వార్థక్యములందు కాంక్షించు వస్తుసముదాయ ప్రాప్తాప్రాప్త ములననుసరించి దుఃఖాదుఃఖబులును అంటియుండును. దినం బులు చక్రపు ఆకులవలె తిరిగి తిరిగి వచ్చుచుండును. కాని జీవికి జీవనప్రమాణము. రోజు రోజుకు హ్రాస్వంబై పోవునని యెఱుంగజాలము. మరణ దుఃఖముకన్న మించిన దుఃఖం బేమికలదు? కావున నీ విషయ దుఃఖమును మరలించి ధర్మ చింతా నిమగ్నుండవుగమ్ము. సదాశివుండు సంతుష్టుండగు నట్టి సత్కర్మలాచరింపుము. ఆ శంకరారాధనబున సర్వ సంకట ములును హరించును. అత్యధిక శుభంబు కల్గును. అని పాండు నందనులకు వ్యాసుండు దుఃఖోపశమనం బొనర్చెను. ఇంక నర్జునుండు శివునింగూర్చి యొనర్చిన తపోఫలితముం గనుం గొనియెదముగాక.

# అర్జునుండు మల్లేశ్వరునిచే పాశుపతమ్ముం గొనుట

వ్యాస ప్రబోధంబున నర్జునుం డింద్రకీలాద్రిపై కేతెంచి అట గల కొలనునందు స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లొనరించి కొని పార్థివలింగంబును బ్రతిష్ఠించి మిక్కిలిభక్తితో నారాధించుచు మనంబున నింద్రునింగూర్చి తపం బొనర్చెను. అప్పుడు యింద్రుడు తన పుత్రుని తపస్సుకు మెచ్చి "ఓ అర్జునా! నీవు ముక్తికొరకు గాక జయము నాంకాక్షించి తపం బొనర్చుచున్నావు. పాకశాసనుండనైన నేనును బ్రహ్మ, విష్ణు మొదలైన వారెల్లరును శివునే పూజింతుము. లింగము నెదుట ప్రతిష్ఠించుకొనియు నన్నేల ఆత్మగతంబునం దలంచితివి? దీనివలనం బ్రయోజనము లేదు. ఇంకనైన నిశ్చలభక్తితో నా పరమ శివునే ఆరాధింపుము. ధ్యానింపుము. అటులైనచో నీ సంకల్పము నెఱవేరంగలదు. అని యాదేశించి యింద్రుం డంతర్హితుండయ్యెను.

అర్జునుండు స్థిరసంకల్పముతో శివునింగూర్చి తపం బొనర్పసాగెను. అంతట నాతని తపోభంగ మొనర్ప నొక దైత్యుండు వరాహరూపంబునఘీంకార మొనర్చుచుఅర్జునుడున్న చోటకు పరుగిడుచుండె అది గని పరమశివుండు భిల్లునిరూపంబున నా వరాహంబును వెన్నంటి యొక బాణంబునుసంధించెను

అర్జునుండును నొకశరంబును ప్రయోగించెను. ఇరుపక్షంబుల బాణంబులొకే పరి యాసూకరంబునకుఁదాకిన నది విలవిల దన్నుకొని మరణించెను. ఆ బాణంబుల బరిగ్రహించుటకై ఒకవైపు భిల్లుండును మఱియొకవైపు ఫల్గుణుండును సమీపించిరి. ఆబాణ ప్రయోగం బెవ్వరు ముందొనర్చినదిన్నీ దేలక యుద్ధంబునకు సిద్ధమైరి. పార్థుండు తనమనంబున శంకరునిసంస్మరించుచు రణంబున కియ్యకొనెను. అదియుంగని పరమ శివుండు భక్తవాత్సల్యంబునం దానోడినట్లు నటించి 'ఓ అర్జునా! నీభక్తిం బరీక్షించుటకై నేనీరూపంబున వచ్చితిని, నీశక్తికి సంతసించితిని. ఏదేని వరముం గోరుకొమ్మిచ్చెదనన విని కిరీటి బ్రహ్మానందభరితుండై సాష్టాంగ ప్రణామంబులు లొనరించి దేవాదిదేవా! మహేశా! జగత్ప్రభూ! పగతుర జయించుటకై ఒక దివ్యాస్త్రమును దయసేయ గలందులకు ప్రార్థించుచున్నాను. అనగనే దయామయుండైన యామహాదేవుండు "ఓ శ్వేతవాహనా పాశుపతాస్త్రము నిచే యొసంగుచున్నాను గైకొ"మ్మని యాయస్త్రము నొసంగి "ఇంక మీదుఃఖంబులు క్రమక్రమముగ అంతరించునుగాక" అని యాశీస్సొనర్చి అంతర్హితుండయ్యెను. పాండవులకు శ్రీకృష్ణుం డొనర్చిన హితోపదేశ శివారాధనము సఫలీకృతంబయ్యెను.

పూర్వంబిట్లె అగస్త్య మహాముని యొక్క ఆదేశానుసరణి శ్రీరామచంద్రుఁడు శివారాధనం బొనర్చి ఆపరమేశ్వ

రుని యనుగ్రహంబున నొక మహా దివ్యాస్త్రముం గొనినట్లు తెలియంగల పద్మపురాణ "శివగీత" యందలి ముఖ్యశ్లోకంబు లిటనుదాహరించు చుంటిని ప్రాజ్ఞులు గమనించెదరుగాక.

## శ్రీ రామ చంద్రునకు దివ్యాస్త్రప్రాప్తి

శ్లో॥ ఏవంచే చ్ఛరణం యాహి పార్వతీపతి మవ్యయం ।
సచేత్ప్రసన్నో భగవా న్వాంఛితార్థం ప్రయచ్ఛతి
(శి॥ తృ॥ ౧౨)

అలాగైనచో ఓ రామచంద్రా! నీవు అవ్యయుఁడగు పార్వతీనాథుని సేవింపుము! ఆభగవానుఁడు ప్రసన్నుండగుచో నీవు వాంఛించిన మనోరథముల నీడేర్చును.

శ్లో॥ దేవైరజేయ శ్శక్రాద్యై ర్హరిణా బ్రహ్మణాపివా,
సతే వధ్యః కథం వ్యాసా చ్ఛంకరానుగ్రహంవినా.
(శి॥ తృ॥ ౧౩)

ఆ దశకంఠుఁడు, ఇంద్రుఁడు మొదలైన దేవతలకును బ్రహ్మదేవునకును శ్రీ మహా విష్ణువునకును అజేయుండు. అంతటి బలపరాక్రమములు గల్గిన రావణబ్రహ్మ శంకరుని యొక్క అనుగ్రహము లేనిదే నీకెట్లు వధ్యుఁడగును? ఎట్లు సీత పొందబడును. కావున శంకరుని సేవింపుము.

శ్లో॥ అత గస్త్వాం దీక్షయిష్యామి విరజాగ మమాశ్రితః।
తేనమార్గేణ మర్త్యత్వం హిత్వా తేజోమయోభవ॥
యేనహత్వారణే శత్రూన్సర్వా న్కామా నవాప్స్యసి।
అథప్రణమ్యరామ స్తందండనన్మునిసత్తమం॥(శి॥తృ॥౧౭)
ఉవాచ దుఃఖ నిర్ముక్తః ప్రహృష్టే నాంతరాత్మనా...౧౮

ఓ రామా! అందువలన నీవు శివ ప్రీతికరమైన విరజాదీక్షను వహింపుము. ఆ దీక్షచే మానవత్వమును వదలి తేజోమయుఁడవు కమ్ము! ఈ మార్గముచేతనే యుద్ధమున సమస్త శత్రువులను వధించి, సమస్తకామ్యములనుపొందెదవు.

పిమ్మట దాశరథి మునిశ్రేష్టుండును, ఉపదేష్టయునగు నా యగస్త్యమునికి ప్రదక్షిణ నమస్కృతులొనర్చి దుఃఖమును వీడినంత–

శ్లో॥ ఏవంకురు మహారాజన్ శివనామ సహస్రకం।
ఇదంతు సంప్రదాస్యామి తేనసర్వమవాప్స్యసి॥
(శి॥ గీ॥ తృ॥ ౫1)

ఓ రాజా! యీలాగు చేయుము. ఈ శివ సహస్ర నామము నీ కొసంగెదను. దానిచే సర్వప్రయోజనములను పొందెదవు.

శ్లో॥ ఏవముక్త్వాముని శ్రేష్ఠే గతే తస్మిన్నిజాశ్రమమ్।
అథరామగి రౌరామః పుణ్యే గోదావరీతటే (శి॥ చ॥౧)

శివలింగం ప్రతిష్ఠాప్య కృత్వాదీక్షాం యథావిధిః।
భూతిభూషిత సర్వాంగో రుద్రాక్షా భరణైర్యుతః॥
(శి॥ గీ॥ చ॥ ౨)

నిత్యంచ శాశ్వతం శుద్ధం ధ్రువమక్షర మవ్యయం।
ఏవంనిత్యంప్ర జపతో గతంమాస చతుష్టయం॥
(శి॥ గీ॥ చ॥ ౧౦)

మునిశ్రేష్ఠుండగు నగస్త్యుండు యీ విధముగా రాముని బోధించి తన యాశ్రమమునకు బోయెను. అంత రామచంద్రమూర్తి పుణ్యగోదావరి నదియొక్క తీర్థమందలి రామగిరి యందు శివలింగమును ప్రతిష్ఠించి శాస్త్రీయమైన దీక్షను పొందెను. భస్మమును సర్వావయవములకుం బూసెను. రుద్రాక్ష పేరులనుదాల్చెను. అవ్యయుఁడును, నిత్యుఁడును, పవిత్రుండును; నాశనరహితుండును, స్థిరుండునునగు పరమశివుని నిర్మలమైన మనస్సుతో జపించుచు నాలుగునెలలు గడపెను.

శ్లో॥ అథదివ్యంధను స్తస్మై దదౌ తూణీరమక్షయమ్।
మహాపాశుపతంనామ దివ్యమస్త్రందదౌతతః॥
(శి॥ గీ॥ వం॥ ౧౩)

తరువాత పరమేశ్వరుఁడు ప్రత్యక్షమై పవిత్రమైన ధనస్సును, అక్షయ తూణీరమును, మహా పాశుపతమను దివ్యాస్త్రమును రామునకొసంగెను.

ఇట్టి మహత్తరాంశంబు లెన్నియో గలవు. గ్రంథవిస్తర భీతింగ్లుప్తీకరించుచు నీ మల్లేశ్వర ప్రతిష్ఠాది శాసనకాండము నిట విశదీకరించుచున్నాను

# శ్రీ కృష్ణదేవరాయుల ప్రశస్తి

ఆర్క్యాలాజికల్ నంబరు 251of 1895ల రిపోర్టు కాకాని శాసనము VOI, IV లలో శ్రీ కృష్ణదేవరాయలు తనమంత్రి వర్యులలో నొక్కండైన తెంటూరి చిట్టరసుచే నీ మల్లేశ్వర ప్రతిష్ఠ యొనర్పింపం జేసినట్లు తెలియం గల్గుచున్నది

శ్రీ కృష్ణదేవరాయలు సర్వజ్ఞుండగుట హరిహర భేద మావంతయు లేక ఆస్తికుల అర్చారూపములగు ననేక శివ, కేశవ ఆలయంబులు హంపి విజయనగరము నందెగాక ఆసేతు హిమాచల పర్యంత మటనట నెలకొల్పి జగజ్జేగీయమాన యశోవిరాజితుండయ్యెను. అందే కాకాని మల్లేశ్వర దేవాల యంబొక్కండై వెల్లివిరిసినది. రాయలవారికి కాకానిమల్లేశ్వ రవరప్రసాదంబున నొకపుత్రుం డుదయించుటచే నీ మల్లేశ్వర స్వామి తొల్లింటినుండి కోరిన వరంబుల నొసంగు మహాదేవుం డైయుండుట గనంబడుచునే యుండెను.

శ్రీకృష్ణదేవరాయలు "హరరామ మందిరము" మొద లైన కట్టడములపై యొనర్పించిన శిల్పము విదేశీయుల చేతం

గూడ సంస్తుతింపంబడియుండుట వారి శిల్పకళాభిరుచి మనకు గోచరించుచునే యున్నది. అంతేగాక రాయలవారు మహాకవియై పలుభాషలలో నొక కొన్ని కృతులొనర్చి నట్లుకూడ "ఆముక్తమాల్యద" మను "విష్ణుచిత్తీయ" పీఠికంగల యీ క్రిందిపద్యము సాక్ష్యముగ నుండుట నిందు దాహరించు చున్నాను.

సీ॥ పలికితు త్ప్రేక్షోప మలజాతి పెంపెక్క
రసికులానన "మదాలసచరిత్ర"
భావధ్వని వ్యంగ్య ♦ సంధిగాఁగ జె
ప్పితివి "సత్యావధూ ♦ ప్రీణనంబు"
శ్రుతి పురాణోప సం ♦ హితలేర్చి కూర్చితి
"సకల కథాసార ♦ సంగ్రహంబు"
శ్రోత్ర ఘుచ్చటలు వి ♦ చ్చఁగ రచించితిసూక్తి
నైపుణి జ్ఞాన చిం ♦ తామణికృతి

గీ॥ మఱియు "రసమంజరీ" ముఖ్య ♦ మధురకావ్య
రచన మెప్పించుకొంటి గీ ♦ ర్వాణభాష
నాంధ్రభాష యసాధ్యంబె ♦ యందునొక్క
కృతి వినిర్మింపు మికమాకు ♦ ప్రియముగాఁగ. (ఆ।పీ।)

అని తెలుగు వల్లభరాయఁడు తనకలలో గనంబడి యర్థించినట్లు వ్రాసికొనంగలైను. ఇందు రాయల రచనలును

ద్యోతకంబయ్యెను ఈ మహాకవి పెద్దనాది మహాకవుల నెంద రినో తన యాస్థానాష్ట దిగ్గజములనానిల్పి వారిచే ననేకకృతు లొనర్పించి బాగొన్నింట గృతిపతియై యుండుట ఎల్లరెరింగి నదే. అందు శ్రీ కందుకూరి రుద్రభద్ర సోదరకవులలో రెం డవ మహాకవి యొనర్చి రాయలవారికే యంకితముచేసిన "సరసమనోభి రామము" నంబాగ్రుతిపతి శ్రీకృష్ణదేవరాయల దిగ్విజయాదుల నభివర్ణించి యుంకుట ఇందు బాహ్యతము.

సీ। దంభ భూవిభురక్త ♦ ధారలెల్లను సర్వ
శక్తికినిడె శిర ♦ స్నానముగను
చనటి ధరాధీశ ♦ చర్మసమూహంబు
చండికకిడెవస్త్ర ♦ చయముగాను
శత్రురాజితలలు ♦ సరిగూర్చి జగదేక
మాతకునిడె గంఠ ♦ మాలగాగ
కఠిన మానవమాంస ♦ ఖండములొని జగ
దంబకు నిడెభోజ ♦ నంబుగాగ

గీ॥ అతఁడు సామన్యభూవిభు ♦ డగునె సకల
రాజ నక్షత్రలోక మా ♦ ర్తాండమండ
లుండు శ్రీ మూరు రాయర ♦ గండఁడఖిల
రమ్య గుణహారి శ్రీ కృష్ణ ♦ రాయశౌరి. (స॥ పీ॥)

ఈ కావ్యరచనాదుల నెఱుంగ వలెనన్న నాచే లో గడ (1940) రచింపంబడిన "దేశహిత ప్రదీపిక" ప్రథమభాగం

బును పఠింతుముగాక. శ్రీకృష్ణదేవరాయలు స్త్రీ విద్యాభి మానియై రసిక శిఖామణియైయున్న యంశముంగూర్చి కొంత వివరింతును. ఇందే రాయలకు శివానుగ్రహమున నొక పుత్రుం డుదయించినట్లు కూడ తెలియఁగలదు.

## శ్రీకృష్ణరాయలకు మల్లేశ్వరానుగ్రహ సుపుత్రప్రాప్తి

రాయలపుత్రిక "మోహనాంగి" యను విధుషీమణి "మారిచీ పరిణయంబు" రచించితండ్రికే యంకితమొనర్చినట్లు గల కావ్యకృతి ముఖ్యాంశంబులంగూర్చినపద్యంబుదాహృతము

మ॥ కనకంపున్నొఱ చేల కట్టుకొని బం ♦
గారంపు రంగూనె బో,
జ్జను యుష్మజ్జనకుండు; మాజనని సా ♦
హౌత్స్వర్ణపుం ముద్దుశ్రీ
కనకాంగీమణి; కాన మీకడుపు బం ♦
గారయ్యోనంచున్ నిజాం
గన నవ్వన్నగు బ్రహ్మమజ్జన కునిన్ ♦
గావించు దీర్ఘాయుగన్. (5)

సీ॥ చతురంగ బలయుత ♦ సైన్యముల్ నడిపెడు
నతఁడునాతో జతు ♦ రంగమాడు
గంగార్భటిని నాకు ♦ కవితఁ జెప్పనతండు

నా సమస్యాపూర్తి ♦ కాసజెందు
దిక్కుడ్యములను స ♦ త్కీర్తిఁ జిత్రించునా
తండునా వ్రాయు చి ♦ త్రములమెచ్చు
రాగసంభరి తాంత ♦ రంగుఁడౌ నతఁడునే
రాగమాలాపింప ♦ రక్తిఁగాంచు

గీ॥ నన్ను మన్నాధునింట మ ♦ న్ననలతోడ,
గన్నులను గప్పుకొని ప్రోచెఁ ♦ గాదెయట్టి
పిత మహా కావ్యకర్తనన్ ♦ గృతినిగోరె
నాదుభాగ్యంబు వర్ణింపఁ ♦ గాదరంబె! (కృతినుతి 3౮)

మఱియు నీ కవయిత్రి మగుడి రాయలను సంబోధించి చతుర్థాశ్వాస ప్రారంభంబున వ్రాయుంగల్గిన వచనంబు నీ క్రింధం గననగును-చూ॥

"వ॥ తండ్రీ! నా యొనర్చినపుణ్యం బగణ్యంబగుట నిస్సంశయంబు...మీరు పరిగ్రహించి ధన్యంజేయ నెంచిన కావ్యకన్య కరచరణా ద్యవయవంబు లేర్పడి మత్కవితా గర్భఁబునుండి వెలువడకయమున్న వెలందుల తలమిన్నయైన మాయంబ తిరుమలాంబాదేవి గర్భంబు ఫలించి...పుత్రసంతానంబుబడసినది. సదాశివు సత్కృపంబొడమిన మాతమ్ముడు సదాశివుండు దినదిన ప్రవర్ధమానుఁడై. సౌందర్యంబునఁ గందర్పసమానుండై తల్లిదండ్రులరగు మీకును, నక్కలమగు

మాకును దక్కెంగల యెల్లవారలకు నల్లాదు ముద్దుగ బెసగు చున్నాడు.” (మా॥ ప॥ చ॥ 2)

పై వచనంబున శ్రీకృష్ణదేవరాయలకు శ్రీ మల్లేశరస్వామి కృపవలననే, కుమారుం డుదయించినట్లు తెలియం గల్గినది. నాఁడేగాక నేఁడున్ను కాకాని మల్లేశ్వరుసత్కృపకు పాత్రులైన వారెందరో పుత్రసంతతింగని “సాంబశివ” “మల్లేశ్వర” “మల్లికార్జున” “శంకర” “సదాశివ” మొదలైన పేర్లుపెట్టు కొనుచు తమతమ మ్రొక్కుబడులను చెల్లించుకొనుచుండుట ఎల్ల రెఱింగియే యుందురు.

శ్రీకృష్ణదేవరాయలు తీర్థయాత్రనొనర్చుచు నీకాకాని విచ్చేసి పరిస్థితులెఱింగి చిట్టన్నచే శ్రీ మల్లేశ్వర ప్రతిష్ఠ నొనర్చుట కానతి నొసంగుటాదిగా నేటివరకుగల శాసన చరిత్రాంశంబులతో నీ స్థల మాహాత్మ్యమును రెండవగుళు చ్ఛంబునం బూర్తి గావింపందలంచితిని. సర్వం శ్రీ శ్రీ శ్రీ

గద్య

ఇది : శ్రీ విశ్వజ్ఞగోత్ర పవిత్ర, వోలేటి వంశార్ణవ కుముదమిత్ర, నాగాచార్య నాగమాంబ తృతీయ పుత్ర, ‘దేశహిత ప్రదీపిక’ ‘విజయధ్వజి’ ఇత్యాది బహుగ్రంథకర్త ‘దేశభక్త’ బిరుద విభ్రాజమాన మానసీయ, బుధ జనవిధేయ, సుబ్రహ్మణ్యశర్మ విరచిత శ్రీ మల్లేశ్వరక్షేత్ర మహాత్మ్యంబను మహాస్థల పురాణంబున ప్రథమభాగము సంపూర్ణము.

# ద్వితీయ భాగము

# శ్రీ పెదకాకాని మల్లేశ్వర క్షేత్ర

మహాత్మ్యము (స్థలపురాణము)

శ్లో॥ కాకాని పట్టణనివాస మహేశ ! శంభో !
కాత్యాయనీ వదన పంకజ పద్మబంధో !
బ్రహ్మాది నిర్జర గణార్చిత పాదయుగ్మ,
శ్రీ మల్లికార్జున విభోతవ సుప్రభాతమ్.

భాషాపోషణంబున "నాంధ్ర భోజుండ"నం బరిగినట్టియు, "శ్రీమాన్ మహారాజాధిరాజ" "రాజపరమేశ్వర" "మూరు రాయరగండ" "అరిరాయవిభాడ" "భాషిగెతప్పువరాయర "గండ" "అష్టదిగ్రాజమనోభయంకర" "పూర్వదక్షిణపశ్చిమ సముద్రాధీశ్వర" "యవనరాజ్యస్థాపనాచార్య" "గజపతి విభాడ" "పరప్రతాప" బిరుదవిభ్రాజితుండైనట్టియు శ్రీ శ్రీ శ్రీకృష్ణదేవరాయ సార్వభౌముడు శా॥ ౧౪౪౦ సంవత్సర ప్రాంతమున తీర్థయాత్రాభిరుచితో విజయవాడ విచ్చేసి సర్వ తీర్థమయియైన కృష్ణానదియందు స్నానసంధ్యా ద్యనుష్ఠానం బులను దీర్చుకొని బ్రాహ్మణులకు గో, భూ, సువర్ణాది దానము లొనర్చి, సాక్షాత్తు జగన్మాతయైన కనకదుర్గాదేవిని సేవింప నింద్రకీలాద్రి సోపానంబుల నెక్కుచు బీదసాదలకు కడుదాన ధర్మములుచేయుచు తన మంత్రిసామంతులతో దేవిసన్నిధి

కేగి ఆలయముచుట్టు ముమ్మారు ప్రదక్షిణల నొనర్చి దేవిని సందర్శించి, అర్చకులచే సహస్రనామ పూజలు మొదలైనవి గావింపంజేసి నారికేళాదుల నైవేద్యమొనర్చి కర్పూరనీరాజనాదులిచ్చి కన్నులనద్దుకొనుచు నీ క్రింది శ్లోకముచే సంస్మరించెను.

శ్లో॥ మాణిక్య వీణాముపలాలయంతీం ।
మదాలసాం మంజుల వాగ్విలాసాం ।
మాహేంద్ర నీలద్యుతి కోమలాంగీం ।
మాతంగకన్యాం మనసాస్మరామి॥

ఇట్లు దుర్గాదేవిని స్మరించి, నమస్కరించి ప్రసాదమును పుచ్చుకొని మల్లికార్జునస్వామిని సేవించి మధ్యాహ్నంబగుడు గట్టుందిగి విడిదికింజేరి, షడ్రసోపేతంబుగ భుజించి సాయంతనంబునకు కృష్ణానదిందాటి సీతానగరాద్రింజేరి అట మలయమారుత వీచికాసౌరభముంగ్రోలి విశ్రాంతిగైకొని దక్షిణదిశాభిముఖంబుగ ట్రంకురోడ్డు (దండుదారి) నంబయలుదేరి అంభారీవనుంగుపై నెక్కి అశ్వదళంబు ముందునడువ పండువెన్నెలం జక్కగావయనించి మంగళగిరి జేరిరి. అట డేరాలను వేయించి 1, 2 రోజులందు నివసించి, నరసింహదేవుని సేవించి "పానకాలరాయం" డను దేవుని సేవింప గట్టుపైకెక్కి పానకంబును సమర్పించి మిగిలిన పానకంబును ప్రజలకొసంగి తాన్గొంతగ్రోలి రత్తపురంబువైపు వెళ్లుచున్నతరి, రెంటూరి చిట్టరసను మంత్రి

తన గ్రామంబైన యీ "కాకాని" నామక గ్రామమునందు నిలుచునట్లుచేసి ఈశివమాహాత్మ్య విశేషంబులను జెప్పందొడంగెను. ఆపురజనులును చిట్టరసునకు మద్దత్తుగ నిలువంబడి రాయలవారికింకను ఆ శివమహాత్మ్యము నిట్లు మనవిచేయదొడంగిరి.

## పురజనుల విజ్ఞప్తి - రాయల యనుమతి

శ్రీకృష్ణదేవరాయ సార్వభౌమా! పూర్వమీప్రదేశము దండకారణ్య పీఠభూమియైనను కృష్ణానదీతీరమున నుండుటచే లంకాధీశ్వరుల పాలనంబున నుండెడిది. కాకాసురుఁడు తన యిష్టదైవంబైన శివునింగూర్చి తపంబొనర్చి కృతార్థుండై తన అర్చారూపక శివలింగము నిటనే నిలిపెను. అప్పుడీ ప్రదేశంబునకు రాగల్గిన శ్రీరామచంద్రుండు ఆశివలింగము నర్చించెనని చెప్పుదురు. ఆ శివలింగము భూగర్భమునంగలిగి యుండినను ఆ శివమహిమ మాత్రమిట దినదినాభివృద్ధిగనే యున్నయది. నిజముగా మీరీస్థలమునందు శివాలయమును కట్టించినచో నాపరమశివుండు మీకు పుత్రసంతానముకూడ గల్గునట్లనుగ్రహించగలఁడ' ని మనవి చేసిరి. రాయలవారు ఆ పౌరుల మాటల నాలకించి, తక్షణమే చిట్టరసుమంత్రికి వలసినంత ధనంబొసంగి త్వరలో నీ స్థలంబున శివాలయము కట్టించవలసినదని అనుమతి నొసంగి ఆత్మగతంబున "మహా

దేవా! నాకు కుమారుండు గల్గుచో నీపేరే పెట్టుకొనియెదను" అని మ్రొక్కుకొనెనట. అటుల చిట్టరసుమంత్రికి తన యనుమతి నొసంగి రాయలవారు సాయంతనమునకు గర్తపురంబు (గుంటూరు) నకేగి యట నాగేటు గడపి యథేచ్ఛగ తమ స్వస్థానంబున కేగెను.

# మల్లేశ్వరకటాక్షము - ప్రతిష్ఠాదికము

రాయలవారి యనుమతి నొసంగిన చిట్టరసుమంత్రి కాకాని పొలంబున నాశివస్థలంబుం జక్కబరచి శాస్త్రీయముగ నొక శిల్పాచార్యునిచే ఆలయనిర్మాణం బొనర్పించి శివలింగ ప్రతిష్ఠయు గావించెను. అట కృష్ణదేవరాయలకు పుత్రుండుదయించుట "సదాశివ" రాయలని నామకరణం బొనర్చుటయు జరిగినది. రాయల పుత్త్రుండు దినదినాభివృద్ధిగ పెరుగుచున్నాడు. కాని రాయలు మల్లేశ్వరస్వామికి ఇంకను చేయవలసిన సేవను మరచి కేవలము రాచకీయ కార్యము నందె నిమగ్నమానసుండై మంత్రితిమ్మరుసును తొలగించి తానె యామంత్రిపదవి నధిష్ఠించి తన ఆరేడుల యీడుగల పుత్త్రునకు పట్టాభిషేక మొనర్చి పరిపాలనము సాగించెను, "శివకటాక్షమునకుదూరుండైన నరుండెంతటివాఁడైనను గట్టుకెక్కనేరం" డన్నట్లు రాయలకెంత సామర్థ్యంబున్నను వికలత్వంబేర్పడియెను. ఇంతలో నకాత్తుగా బాలరాజు మరణించుటయు,

# పండితాభిప్రాయములు

శ్రీ కొత్తభావయ్యచౌదరి "దేవరహస్యాలు" మొ॥ బహుగ్రంథకర్తగారి

లేఖనము.

శ్రీ 'దేశభక్త' కోలేటి సుబ్రహ్మణ్యశర్మగారు రచించిన కాకాని చిన్నమల్లికార్జునస్వామివారి చరిత్రము స్థాలీపులాకన్యాయమునఁ జదివితిని. వీరు ఆంధ్రదేశములో ప్రసిద్ధి జెందిన విమర్శక కవులలో నొకరు. విశ్వబ్రాహ్మణశ్రేణికిఁ జెందిన వారు. సర్వదా సర్వమత, కుల, సాంఘిక సమన్వయమును గోరువారు. పరమేశ్వరారాధన మన్ని దేశములలోను గలదు. కొన్నిచోట్ల యేకేశ్వరారాధనము, మరికొన్నిచోట్ల పలు తెరగుల దేవతారాధనము లేక వీరపురుషారాధనము, మత కర్తలు లేక ప్రవక్తలు - అనగా అవతారపురుషుల ఆరాధనము, ఇట్లు జరుగుచున్నను సర్వేశ్వరుని యందలి విశ్వాసముతో యిది జరుగుట యెల్లెడలను గనుచున్నాము. మానవులు త్రికాలాబాధ్యుడగు సర్వేశ్వరుని తామేర్పరచుకొన్న యనంతనామ రూపములతో స్మరించి, ధ్యానించి, పూజించి, తమకున్న సంపదలర్పించి తమ కోరికల నన్నింటిని దీర్చుకొనుట విశ్వసనీయాంశమే పురాతనకాలములో మానసిక పూజ లాచరించువారు. క్రమముగా ననంతరూపనామములతో పూజించుట, దానికనువగు పవిత్ర స్థలముల నెన్నుకొని యందు వారికి తోచిన రూపనామములతో విగ్రహములను బ్రతిష్ఠించుట యిత్యాదులు ముఖ్యముగా మన దేశములో నెల్ల వెల్లివిరిసినవి.

ముఖ్యముగా చాల ప్రాచీనకాలము క్రిందటనే శ్రీశైల మల్లికార్జునస్వామి ప్రతిష్ఠింపబడుటయు తరాంతక్రమముగా

పండితాభిప్రాయములు

విజయవాడ, చేబ్రోలు, కాకాని, త్రిపురాంతకము మొదలగు చోట్ల నీ స్వామి పేరిటనే దేవాలయములు వర్ధిల్లుట జరిగెను. కాకానిలోని మల్లికార్జునస్వామిని సేవించి కృష్ణదేవరాయల మంత్రులలో నొకరగు రెంటూరి చిట్టమరుసుమంత్రి ఆలయాదులు కట్టించి వృద్ధికిదెచ్చెను. తదాది యీ పుణ్యస్థలము భక్తులకు పవిత్రక్షేత్రమై స్వామివారి యనుగ్రహపాత్రులను జేయుచున్నది. ఈక్షేత్రమాహాత్మ్యమును పురాణాదులనుండి వెదకి సంపూర్ణముగా నిందు లిఖించుటయెగాక, చారిత్రక శాసనములను గూడ జోడీకరించి తమ సంస్కృతాంధ్ర పాండిత్యప్రకర్ష కనబడునట్లు గ్రంథము చివర గ్రంథసారముగా సుశ్లోక చరిత్రమునుగూడ రచించిన గ్రంథకర్తగారి కృషిని కొనియాడదగియున్నది. భక్తులకుపయోగించు ననేక విషయములిందు జేర్చుట సమంజసముగా నున్నది. శ్రీ మల్లికార్జున స్వామి సేవాసక్తులకీగ్రంథరాజ మానందదాయకంబగుగాక !

సంగంజాగర్లమూడి
7-4-1960

కొత్త భావయ్య చౌదరి,
దేవరహస్యాలు మొ॥ గ్రంథకర్త.

అష్టావధాని, కవిరత్న, విద్వాన్ శ్రీ వంగవోలు ఆదిశేషశాస్త్రి బి. ఏ.,
(ప్రధానాంధ్ర పండితులు ఎద్దనపూడి.)

మ॥ శివభక్తిప్రవణంబు నీహృదయ రా ♦ జీవంబు సత్యస్వరూ
పవిరాజద్భవదీయ కావ్యరచనా ♦ ప్రాగల్భ్యమెన్నంగ స
త్కవి సంస్తుత్యమనంగ జెల్లుభువి శ్రీ ♦ కాకానిమల్లేశ క్షే
త్రవిశేషంబునఁజూడనయ్యె బుధ! సు♦బ్రహ్మణ్యశర్మాగ్రణీ!

ఎద్దనపూడి,
12-7-60

వంగవోలు ఆదిశేషశాస్త్రి,
జిల్లాపరిషత్ హైస్కూలు.

తిమ్మరుసుమంత్రియె మందిడి చంపినటుల గ్రహించి వెంటనే యాతని రెండు కనుగ్రుడ్లను తోడించి జైలుపాలొనర్చుటయు తదుపరి పశ్చాత్తప్తుడై యయ్యు పుత్రశోకంబున కనలి, కనలి కొలదికాలములో రాయలు దివంగతుడయ్యెను. ఇట చిట్టరసు మంత్రికూడ శివాలయాభివృద్ధిం జేయనోపక యెట్లెట్లో కాలము గడపి కాలధర్మము నొందెను, మల్లేశ్వరుకటాక్షము సన్నగిలినట్లు 1910 సం॥ నాటికి ఆయా ఆలయ కట్టడంబంతయు జీర్ణించి శిథిలంబైనందున పునరుద్ధరణ, పునఃప్రతిష్ఠ జరుగబడ వలసివచ్చినది.

## జీర్ణాలయోద్ధరణ, శిల్ప కళోద్ధరణ

రాయల యనంతరకాలంబునం దేర్పడిన దాడుల వల ననో మరి యేకారణంబుననో కడు శిథిలావస్థనందిన యీ కాకాని మల్లేశ్వర క్షేత్రమును సముద్ధరించి ప్రాచీన శిల్ప సంప్రదాయ సిద్ధహస్తులైన "దేవశిల్పి" మైలాపూరు శోభనా చలాచార్యులచే నూతన నిర్మాణంబునందుసయితము హంపి విజయనగరాలయంబులందలి శిల్పకళమెరయ ఉద్ధరించిన శ్రీ శ్రీ కొల్లిపర వేంకటరత్నశ్రేష్ఠిగారెంతయు చరితార్థులై యున్నారు. ఉదాహరణంబుగ గుడి ఉత్తర దక్షిణ ద్వారం బుల ప్రక్క పైభాగంబున (1) 'మహిషాసురమర్దని' (2) 'శివ తాండవము' ముఖద్వారంబునకిరుప్రక్కలంగల (3) 'జయంతి'

(4) 'జయపాల' విగ్రహరచనమునందా శిల్పకళ మూర్తీభవించినట్లగపడును.

నేఁడుకూడ నట్టి శిల్పకళ నెఱుంగవలెనన్న ప్రస్తుతము విజయవాడ యింద్రకీలాద్రిపై ప్రతిష్ఠింపబడిన "నటరాజస్వామి" "శివకామ సుందరి" (మూలవిరాట్) మూర్తులందును కృష్ణానది వైపునంగల విజయేశ్వరాలయ స్థలంబున శిల్పశ్రీ మైలాపూరు శివగంగాధరాచార్య, షణ్ముఖాచార్య సోదరులచే రచింపబడుచున్న రజత, తామ్ర, లోహ, శిలామయ మూర్తులందును గనంబడగల్గుచున్నది.

"వైశ్యులు అగర్భశ్రీమంతులు, ఆస్తికదురంధరులు, మాఘపండితునివంటి* మహాత్యాగశీలురింద యుందు"రనుటకు గో, భూ, సువర్ణాది దానంబులచేతను, బ్రాహ్మణ సమారాధన మొదలగునవి శ్రీ మల్లేశ్వరస్వామి ప్రతిష్ఠయం దపారముగా నొనర్చి యుండుటచేతను శ్రీ కీ॥ శే॥ కొల్లిపర వేంకటరత్నశ్రేష్ఠివంటి మహనీయులే తార్కాణంబగుచున్నారు.

పునఃప్రతిష్ఠింపంబడిన ఈ సవిస్తరాలయంబందలి శిల్పాదుల నభివర్ణించిన శ్రీ॥కా॥మ॥ మాఁకావ్య పంచమాశ్వాస పద్యంబు లిట నుదాహృతంబు లగుచున్నవి. చూ॥

---

*మాఘకావ్య ప్రణేత వైశ్యుఁడు. ఈతని దానశీలతంగూర్చి వాచే రచింపంబడిన "ధేశహితప్రదీపిక" నాల్గవభాగంబున గమనింతురుగాక.

తే॥ సర్వతోభద్రదలక్షణ ♦ సంశ్రయమున।
శర్వాని కుటుంబమున కెల్లఁ ♦ జాలునట్లు।
జాల్వను వెడల్పు నొప్పార ♦ సంతరించి।
మేలి ప్రాసాదములు వింత ♦ శైలి వెలయ॥"(కా॥పం॥118)

మ॥ పలకల్దీర్చిన స్తంభముల్పృథుశిలా పట్టమ్ము సంచత్కలా
లలితశ్రీ వెలయించు పత్రికలు కళ్యాణ స్ఫురద్భావనం
వలితానేక లతాకుడుంగములు భాస్వత్పద్మ ముల్దీరులన్
వెలసెన్ శిల్పమనల్పమంచు విబుధుల్ వేనోళ్లఁ గీర్తింపగన్(కా॥పం॥ 119)

సీ॥ ఒకయోర మహిషాసు ♦ రోపసంహారిణి
కార్తికేయుం డొక్క ♦ గవిణియందు,
విఘ్నేశుఁ డొండుని ♦ వేశ పార్శ్వమ్మునఁ
బరభాగమున క్షేత్ర ♦ పాలకుండు,
హరివిరించన ముఖ్యు ♦ లంచిత స్థలముల
దిక్పాలు రాయాత్ర ♦ దేశములను,
మునుకొని బ్రహ్మర్షి ♦ ముఖ్యు లెల్లడలను
వాగ్రమాదులు తమ ♦ వరుసలందు,

గీ॥ వెలయ నిర్మింపఁ జేసెన ♦ వేల హర్ష
దాయకంబుగ నా దేవ ♦ తాయనమున
నా వృతిద్వారంగి హారుని నె ♦ య్యమునఁదవిలి
రత్నములనేర్చి వేంకట ♦ రత్నశౌరి॥ (కా॥మ॥పం॥ 120)

శ్రీ వేంకటరత్న శ్రేష్ఠిగారు ప్రతిష్ఠించిన ఆలయాది మూల విరాట్మూర్తుల దర్శనాదులను గూర్చి తెలిపెదను.

# శ్రీ వీరభద్ర, భద్రకాళీ దర్శనము

ఆలయ ప్రదక్షిణానంతరము దక్షిణద్వారము నుండి గుడిం బ్రవేశించునంతనె వీరభద్రస్వామి (మూల విరాట్ మూర్తి) సందర్శనంబగును. ఈ స్వామిశక్తి పురాణ ప్రసిద్ధమైన దేశదా:- తొల్లి శివమహాత్వ్యము నెఱుంగనేరక ధిక్కారముగ దక్షుఁడు యజ్ఞంబొనర్చు చున్నపుడు యింద్రాది దేవతలందు బాల్గొనియుండిరి. దాక్షాయణి పరిభవంబు సహింపనేరక వీతిహోత్రున కాహుతియయ్యెను. ఆ శివద్రోహుల నప్పటికప్పుడె మారణంబొనర్ప శంకరుండు హుంకరించి, తన జటవిదళించి నంతనే యీ వీరభద్రుం డుదయించి, శివు సంకల్పంబు నిర్వర్తింప రణంబున కియ్యకొని దక్షుని తలంగొట్టి ఆ యాగ విధ్వసంబొనర్చి, బ్రహ్మ విష్ణింద్రాదుల నుక్కడగింపఁజెండాడుతఱి వారందరు దాసోహంబని పాదాక్రాంతులై మిక్కిలి ప్రార్థించి రక్షింపబడిరి. ఇయ్యది, బమ్మెర పోతనామాత్యప్రణీత "వీరభద్ర విజయ" ంబను కావ్యంబునం గనవచ్చును. చూడుండందలి చతుర్థాశ్వాస 52 వ పద్యము.

"ఉ॥ ధారుణి దిర్దిరం దిరుగఁ దామరసప్రభవాండ భాండముల్
బోరునఘూర్ణిలన్ నిఖిలభూతములున్ జెగడొందశూలిహుం
కారము చేసెఁ జేసిన నఖండతరప్రళయాగ్ని సన్నిభా
కారుఁడు వీరభద్రుఁడతిగర్వ సముద్రుఁడు పుట్టె రౌద్రతన్"

ఇట్లుద్భవించిన వీరభద్రుఁడు దక్షయాగ విధ్వంసం బొనర్చి యింద్రుఁడు మొదలగువారిని వధింపందలంపఁడ; వారప్పుడు భీతిలిశరణుజొచ్చి, ప్రార్థించి ప్రసన్నుని గావించు కొనినక్రమంబు నందలి యొకపద్యంబిట ననుసరణీయంబగు నని యుదాహరించుచున్నాను.

కం॥ రక్షింపుము కరుణాకర !
రక్షింపుము లోకనాధ రమ్యాకారా !
రక్షింపుము రిపు సంహర !
రక్షింపుము వీరభద్ర రౌద్ర సముద్రా ! (వీ॥వి॥చ॥ 86)

ఈ పద్యంబును జదువుచు వీరభద్రస్వామికి నమస్కరించవలెను. పూర్వము చిట్టరసుమంత్రి ప్రతిష్ఠించిన సుమారు నిలువెత్తు వీరభద్రస్వామి విగ్రహమును ప్రస్తుతంబీ మల్లేశ్వరాలయ వెలుపల ప్రహరీగోడకు నానించినిలువబెట్ట బడినది. దాని పేరు "అంగడి వీరభద్రస్వామి" అని "సౌత్ ఇండియన్ శాసనావళి" 4వభాగం 222వ పుటంగల*శాసనమువలనం దెలియంగలదు. మఱియు నందలి ధ్యానశ్లోకంబు లిప్పుడు పఠింప దగినవగుట గ్రహింపనగుచున్నవి. చూ॥

శ్లో॥ చక్రమ్మాశింభుజగం గదాపిచ మహాశక్తించ ఖట్వాంగకం।
చాపంచాతశిలీముఖంచపరశుం శూలంతధానః కరైః॥
త్రియతుశ్చంద్ర కళాకలాపరుచిరం నీలాంబుజ శ్యామలం।
పాయాద్విశ్వమిదం ప్రసన్నవదనం శ్రీ వీరభద్రం భజే॥

"శ్రీ భద్రకాళీ పతిపాదాయ పాయాద్భవ రోగవైద్యః।
ఆచంద్రతారార్క మతిప్రసన్నః॥
కాకాని చిట్టిప్రభుమంత్రి చంద్రః॥"

# శ్రీ మల్లేశ్వర ప్రార్థన పంచరత్నములు

గర్భగుడిం బ్రతిష్ఠింపంబడియున్న శివలింగము; యుగ యుగంబులనుండి మూర్తీభవించిన మల్లేశ్వర స్వరూపంబగుట దివ్యమహిమల కాటపట్టయి భక్తునికి సాక్షాత్తు ఉమాకాంతు డైన మహాదేవుని పూర్ణ సందర్శనంబే యగుచున్నట్లుండును. కావున నా ప్రార్థనతో కూడిన పద్య పంచరత్నంబులను సమర్పించు చున్నాను.

౧. శ్రీ కాకాని నివేశ, యీశకరుణా * సింధూ, యుమాబంధు, లో
కైకత్రాతవు, దాతవున్ ప్రవిమల * ధ్యానైక భక్తేప్సిత
శ్రీ కళ్యాణ విధాయకుండవు, నినుం * జింతించి పూజించు న
స్తోకప్రజ్ఞుల నెన్నశక్తులమె యెం * దుం బ్రోవుమల్లేశ్వరా !

౨. శ్రీ రాజీవ భవాది దివ్యవినుతాం * ఘ్రిద్వంద్వ, నిర్ద్వంద్వభా
వారామైక విహార శీలురగు యో * గా రూఢులున్ నిన్నుఁగ
న్నారంగాంచి మనః ప్రపూర్వకముగా * హస్తాంజలుల్ గూర్చి గా
నీ రంజిల్లరటన్నఁ గాంచఁదరమే * హృద్వీధి మల్లేశ్వరా !

౩. నరులెన్నండుఁ గృతార్థు లయ్యెదరెనీ * నామంబు రూపంబు సు
స్థిరభావంబున నీవు నిల్చినమహా * క్షేత్రంబు ధ్యానింప నో

N. B:- * ఈ శాసనంబంతయు తుది పేజీలందు గాంచనగును.

పరమాత్మా, భవదీయ దివ్యచరితన్ * పల్మార నోరారఁ బ
ల్కరమున్ నారద ముఖ్యమౌనులును శ్రీ * కాకాని మల్లేశ్వరా !

శ్రీకంఠా, భవలుంఠనక్రియుతుఁ బు * త్త్రీ పుత్ర సంతానముల్
ప్రాకామ్యంబు లగున్ మృకండ ముఖ * దివ్యర్షి ప్రతానంబుకే
గాకా కృష్ణునికిన్, మహాభ్యుదయముఁ * గల్గించు నీ సేవకున్
లోకుల్ గోరుట దోసమే నిసువులన్ * లోకేశ మల్లేశ్వరా !

విజయుండర్థిఁ దపంబు సేసినఁ గృపా * విర్భూతి సాక్షాత్కృతిన్
విజయ శ్రీ విభవాస్త్ర దాస్త్రములనీ * వే, నిన్నమ్మి కొ
ల్చి జయంబుల్ గననేరనట్టి జనులు * ర్విన్ లేరు, మాకిమ్ము స
ద్విజయాయుర్విభవంబులన్ సుదృఢశ * క్తిన్ భక్తి మల్లేశ్వరా !

ఇట్లు భక్తితోఁ గొలిచి మల్లేశ్వరస్వామిని ఆత్మగతంబు నం బ్రార్థించి ఘంట బ్రమోగించి, నమస్కరించి తీర్థముంబుచ్చుకొని ప్రసాదంబు స్వీకరించి భ్రమరాంబాదేవిని సందర్శించి నతులిడి - కుంకుమగైకొని నొసటంధరించి దక్షిణద్వారమున వెలుపలకు వరుసగ వెళ్లవలయును. మండపంబునం బ్రతిష్ఠింపంబడిన వీరాంజనేయస్వామికి ప్రదక్షిణం బొనర్చుటయు, నైవేద్యంబులనిడి నమస్కరించుటయుగలదు. గాన నందుం గూర్చి స్తోత్రాదుల నుదహరించుచున్నాను.

## శ్రీ ఆంజనేయ కవచము స్తోత్రాదులు

శ్రీ మల్లేశ్వరస్వామి దేవస్థాన ముఖమండపము నందు ప్రతిష్ఠింపబడిన శ్రీ వీరాంజనేయస్వామికి నెల్లరు ప్రణమిల్లుచు

నైవేద్యంబుల నిడుచు తమ ఆత్మగతంబున ధ్యానించుచు యీ శ్లోకార్థంబుల బడయుట గనంబడును. అట్టి భక్తుల ఉపయోగంబునకై హనుమత్కవచంబిట పొందుపరచుచున్నాను.

శ్లో॥ ఏకదా సుఖ మాసీనం శంకరం లోకశంకరం।
ప్రప్రచ్ఛ పార్వతీ భక్త్యా కర్పూర ధవళం శుభం॥
పార్వతీఉవాచ॥భగవాన్ దేవదేవేశ!శంభో!శంకర!శాశ్వత!
మహాదేవ! జగన్నాథ! శివ విశ్వార్తిహారక॥

శ్లో॥ సంగ్రామే సంకటే ఘోరే భూతప్రేతాదికే భయే।
దుఃఖదావాగ్ని సంతప్తే బంధనే వ్యాధిసంకులే॥

శ్లో॥ దారిద్ర్యేమ హతిప్రాప్తే మహారోగే జ్వరేభ్రమే।
చాతుర్థికే సన్నిపాతే వాతేః పిత్తే కఫేతథా॥

శ్లో॥ శోకాకులేషు మర్త్యేషు కేనరక్షా భవేద్ధ్రువమ్।
రుద్రఉవాచ॥ శృణుదేవిప్రవక్ష్యామిలోకానాంహితకామ్యయా
విభీషణాయ రామేణ ప్రేమ్ణాదత్తంచయత్పురా॥

శ్లో॥ కవచం కపినాథస్య వాయుపుత్రస్యధీ మతః।
తద్గుహ్యం సంప్రవక్ష్యామి విశేషాచ్ఛృణు సుందరీ॥

౨. ఉద్యనాదిత్య సంకాశం ఉదారభుజ విక్రమం।
కందర్ప కోటిలావణ్యం సర్వవిద్యా విశారదం॥

3. శ్రీరామ హృదయానందం భక్తకల్ప మహీరుహం।
అభయం వరదం దోర్భ్యాం కలయేమారుతాత్మజం॥

౪. శ్రీరామ రామరామేతి రమేరామే మనోరమే।
సహస్రనామ తత్తుల్యం రామనామ వరాననే॥

ఉల్లంఘ్య స్సింధోస్సలిలం సలీలం యశ్శోక వహ్నిం జనకాత్మజాయా।
ఆదాయతేనైవ దదాహలంకాం నమామినం ప్రాంజలి రాంజనేయం॥

మనోజవం మారుతతుల్య వేగం జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం।
వాతాత్మజం వానరయూధ ముఖ్యం శ్రీరామదూతం శిరసానమామి॥

ఇంక నీ యాంజనేయ స్తోత్రముగ నేనితః పూర్వము రచించియున్న దండకము నిట భక్తుల ఉపయోగార్థము ప్రకటించుచున్నాను.

## శ్రీ వీరాంజనేయ స్తోత్ర దండకము

శ్రీ మన్మహావీర ధీరాంజనేయా! జగద్రక్షా! లోకైక కళ్యాణగాత్రా! మహాతేజ! సంపూర్ణ సాలోక్య, సామీప్య సారూప్య గాంభీర్య రూపుండవౌ నీదు మాహాత్మ్య చారిత్ర సంస్తోత్రమే జేతు రక్షింపవే! మున్ను వేనోళ్ల శేషుండె వర్ణింప లేడన్న నేనెంత? నోదేవ! సద్భక్తిగావింతు; సర్వేశ్వరుండర్మి లిన్ మర్కట క్రీడలన్దేలనౌ తేజము న్వాయు దేవుండు దివ్య ప్రసాదంబుగా నంజనాదేవి కర్పింప నాతేజమున్బొంది జన్మాంధ తన్వాయ, గర్భంబు దాల్చంగ కుక్షిస్థుడౌ నీవు అత్యంత శక్తి ప్రభావుండవై తీవ్రతన్జూప నా బాధసైరింపలే కార్తనాదంబు సేయంగ నాగాడ్పు ఖిన్నత్వ ముంజెందినన్ లోకరక్షణార్థమై

N. B :- ఈ ఆంజనేయ ప్రతిష్ఠ నిటీవలనొక మహాశయుం డొనర్చినదై రంగునది. ఇచ్చటి నాగేశ్వర ప్రతిష్ఠలుకూడ వరుసగ జరుగుచున్నవి. వివరము లింకొకకూర్పు నందు తెలుపంగలను.

బ్రహ్మవిష్ణ్వీశు లేతెంచి నిన్వేడగా స్వర్ణకౌపీన సూత్రాదులన్
గోరితో! వారు శ్రీ విశ్వకర్మన్ స్మరింపంగ నా మేఘవా
హుండు వేంచేసి యోగర్భమందున్న ప్రోడా యివేహేమ
కౌపీన, యజ్ఞోప వీతంబులున్ గుండలంబుల్ వెసన్నిచ్చు
చున్నాను గైకొంచు కామ్యాది రూపంబులన్ శక్తిమంతం
బుగా నెక్కుమందెప్పుడున్ వెల్గవర్థిల్లు మన్నంతలో నా యలం
కారముల్గల్గి యున్నద్భుసంబంది బాల్యంబునన్ భానుబింబంబు
నున్నిమ్మంగ నుంకించి యున్వేద వేదాంగ భాష్యాదులున్గానమున్
గొప్పగా నేర్చియున్నావు! సుగ్రీవు మన్త్రాంగ మందుండి
యా కాననంబందు శ్రీరామ సౌమిత్రులన్గాంచి సుగ్రీవు
సంఘ్యంబుకుంజేర్చి సీతన్విలోకింప పాదోధిలంఘించి, లంకేసు
తల్పాన మండోదరింగాంచి దిగ్భ్రాంతినిన్వీడి నిశ్శోక వృక్షస్త
నీడన్ ప్రకాశించు భూజాతకున్ ముద్రికంజూపి ఆనంద
మొప్పన్ శిరోరత్నముంగొంచు శ్రీరామచంద్రుః న్సమీపించి
యర్పించి యారాము కార్యార్థమై వానరానీకమున్నీవు శైలం
బులన్ జేర్చగా నీలుడవ్వారధిన్ గట్టినన్ లంకకేతెంచి పౌలస్త్య
బాణంబునన్ మ్రందనౌ లక్ష్మణు ప్రాణ సంధాతవై బ్రోవ
సంజీవినిన్దెచ్చితో! నాఁడు శ్రీరాము లా రావణబ్రహ్మ నాభి
ప్రదేశంబునన్ శస్త్రమున్నైవ్వచి గూల్పంగ నా బ్రహ్మహత్యా
ఒఘమున్ బాయగా శంభునే గొల్చి లింగప్రతిష్ఠాదులన్ జేయ
సీతామహాదేవినిన్ బ్రొఢి చేకూర్చితో! నా యయాతిన్
గటాక్షించి యా రామునే పోఁరియున్ గెల్చి యార్తావనుండన్న

కీర్తిన్ త్రిలోకంబులన్ సాటి లోకోత్తరంబాట మల్లేశ్వరస్థాన భక్తౌఖ మున్గాచుచున్నావు! నీ స్తోత్ర ధ్యానంబులున్, ఘంట నోంకార మున్జేయగా ప్రేత భూతాదులన్ శాకినీఢాకినీ గాలి దయ్యంబులన్ అగ్నిలో వ్రేల్చినట్లాను ఓ యర్థిమందార! యోంతారక బ్రహ్మ! విశ్వజ్ఞ గోత్రోద్భవ శ్రీ సుశర్మార్చితా! మారుతీ స్వర్చలాదేవి * నాథా! సదా స్వప్రకాశా! మహేశాంశజా! ఓం నమస్తే నమస్తేనమః.

ఇంకను నీ హనుమస్థవ సందర్భమున (1) "వానరగీత" (2) హనుమదుపాసనా కల్పద్రుమము (3) హనుమత్పంజరము లందలి శ్లోకంబులు పఠనార్హంబులగుట నిట వరుసగ ప్రచురించుచున్నాను. చూ॥

శ్లో॥ మాతా సువర్చలాదేవీ పితామే వాయునందనః,
బాంధవా హనుమద్భక్తా స్వదేశే భువనత్రయమ్. (౧)

శ్లో॥ అథధ్యాయే త్కపిశ్రేష్ఠం చతురాభరణాన్వితమ్,
వామభాగస్థితాం పత్నీం సూర్యపుత్రీం సువర్చలామ్. (౨)

శ్లో॥ సువర్చలాధిష్ఠిత వామభాగం వరాసనస్థం కపిబృంద సేవితం,
నృపాదమూలం శరణంగతానా మభీష్టిదం శ్రీ హనుమంత మీడే. (౩)

---

* "పుష్యమాసి సితేపక్షే చతుర్దశ్యాం శుభేతిథౌ" "హనుమాన్ కపివర్యస్యాం శ్రీ మానుదవత్తదా, తయోరుద్వాహ మారభ్యం బభూవుస్సుఖినోజనాః" "ఇతి ఖగేంద్ర సంహితాయాం మన్త్రశాస్త్రే సువర్చలోద్వాహ కథనంనామ పంచాశీతి పటలః" ఇంకను "హనుమద్విజయము" "పరాశరసంహిత" "శౌనకసంహిత" "సుషేషణ సంహిత" లలోకూడ నీ హనుమత్కథనము గననగును.

## నాగేంద్రస్వామి సంస్తుతి

శ్రీ మల్లేశ్వరాలయ వెలుపల దక్షిణవైపు ప్రహారీగోడ మూల నశ్వత్థ వృక్షమూలంబున నాగేంద్రస్వామి ప్రతిష్ఠింపం బడియుండెను. ప్రదక్షిణంబు లీదేవునకున్నూ చెందుచున్నవి. పూజా పురస్కారములు జరిపి నైవేద్యంబులనిడి మ్రొక్కుటయు, మ్రొక్కులు తీర్చుకొనుటయు ననుదినము జరుగుచునే యున్నది. ఈనాగేంద్రస్వామి స్తోత్రదండకము నిదివరకేరచించి ప్రచురించియుంటిని గ్రంథవిస్తరభీతిచే ఇటనుదాహరింపలేదు.

## శివనామ భజనము, ఫలశ్రుతి

శ్రీ కాళాని మల్లేశ్వరాలయములో ఏకోన్ముఖత నెల్ల వేళలందును ఆర్తజనులచే శివ నామోచ్చారణ జరుగుచునే యుండును. కొందరుభక్తులు గుమిగూడి భక్తి పారవశ్యముతో మల్లేశ్వరనామ సంకీర్తనలం బాడుచుండుటయు గననగును.

అందును ప్రతి శనివార రాత్రులం దెల్లవారుదనుక పలుప్రదేశంబుల నుండి విచ్చేసిన ఆ బాలవృద్ధులీ శివనామ భజనంబునందు బాల్గొని తన్మయులగుచుందురు. ఆ సమ్మేళ నంబిట్టిదని వర్ణించుటకేని అలవికాదు. జాతి మత వివక్షతయును నది మందున కేనిగను పట్టదు.

శ్రీ మల్లేశ్వరుభజనమే ప్రధానంబుగా నొక్క శివభక్తా గ్రేసరుండునిలిచి "సాంబ సదాశివ" "సాంబ సదాశివ" "సాంబ

సదాశివ'' "సాంబ శివా" "సాంబ సదాశివ" అని ఎలుగెత్తి పాడు చూళర తాళంబులు వైవగా; న దేరీతినక్కడన ప్రజాబాహుళ్యం బంతయు "సాంబ సదాశివ, సాంబ సదాశివ, సాంబ సదాశివ, సాంబ శివా సాంబసదాశివ!" అనిపాడుటయు "సాంబ సదాశివ, సాంబ సదాశివ, సాంబ సదాశివ, సాంబశివా" అని పలు సారులు ఆరోహణ అవరోహణల నింపునింపుచు తన్మయత్వము నొంది సాక్షాత్తు సాంబశివునిలో తాము లీనమైపోవు చున్నట్లు గపడుదురు. అటుల కొంతవడి శివనామ భజనము జరిగినపిదప, మఱియొక భక్తుడో భక్తురాలో లేచి ప్రారంభ స్థానమునకు వచ్చి ఆ శివమహిమా విశేషములు కొన్నింటిని ప్రసక్తించి, "సాంబశివునకుజై" "మల్లేశ్వరస్వామికిజై" "భ్రమరాంబా దేవికి జై" "వీరభద్ర స్వామికిజై" "నాగుమయ్యకుజై" అని జైజైధ్వాన ములొనర్చి నమస్కరించి, "ఓం నమశ్శివాయ, నమశ్శివాయ, నమశ్శివాయా, ఓం నమశ్శివాయా" అని చెప్పుటయు అటు లనే "ఓం నమశ్శివాయ, నమశ్శివాయ, నమశ్శివాయా, ఓం నమశ్శివాయా" అనిఅందరు పలుకుటయు మొదటివారు "నమ శ్శివాయను పంచాక్షరములు. నమ్మిభజింతుము బ్రోవుమురా హర, "నమశ్శివాయ నమశ్శివాయ నమశ్శివాయా" ఓం నమశ్శి వాయా" అని చెప్పుటయు అదేరీతి సభ్యులందరును పలుకుటయు ఇటులని "ఓంనమశ్శివాయ పంచాక్షరామృత గేయము" 108 చరణంబులును పాడగల్గినప్పుడు శివ ధ్యానము, శివ స్తోత్రము, నామస్మరణ ఒక్కుమ్మడి గల్గునుగాన మహాతపోఫలము ఇందున చేకూరంగలదు. మఱియు ఓం, ఓం, ఓం, అని 108 పర్యాయ ములుచ్చరించుటలో భక్తులందరి యొక్క కంఠధ్వని నోంకార

శ్రవణము ప్రతిధ్వనించుటచే మనోవాక్కాయ కర్మలందొనర్చిన కిల్బిషంబంతయు హరించి దైవనివేశములుగా దేహాలయములు తయారగును.

ఈ శివనామ భజనమునందు భక్తులనేకులు వ్రాసిన కీర్తనము లనేకము పాడంబడు చుండును. ఉదాహరణంబున కా భజన కీర్తనలందొకం డిట నుదాహరింపం బడుచున్నది.

"అందమె ఆనందం" అనుమాదిరి.

"అందరి కానందం, ఆనందమె శివుభజ నానందం ॥అం॥

భవవిదూరు సంభవ రహితుండగు

భవుని పార్వతీ ధవునిభజనమే ॥అం॥

మల్లేశుని భక్తమరందం రంజిల్లు హృదయార వింద౦

శివస్తోత్ర ప్రబంధం, శివభక్తులకగు ననుబంధం ॥అం॥

కాకానీ నగరాధీశం, కారుణ్య లింగేశం

గోవిందమనుత మల్లేశం, కోటి ప్రభాకర సంకాశం ॥అం॥

కేవలము శివనామ భజనము వలన "భక్తనందనారు" మొదలైన వారేగాక, వ్యాస, నారద, పరాశర, మృకండ, వశిష్ఠాది మహా మహానులుకూడ శ్రీ మల్లేశ్వరనామ జప, తపాదులచేతనే కృతార్థులై నట్లనేక ఇతిహాసంబుల వలనందెలియుం గలదు.

"శ్లో॥ సమస్త వేదవేదాంత సారభూత శివప్రదమ్ ।

శివ నామామృతం దివ్యం పేయం సర్వార్థ సిద్ధిదమ్॥"

శ్రీరామచంద్రుఁడు, శ్రీకృష్ణుఁడు, బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులు సయితము యీ శివపూజ, జప, స్తోత్ర, సంస్తుతుల నర్పించియే తమతమ యిష్టకామ్యార్థ సిద్ధులను పొంది యున్నట్లిదివఱకే కొన్ని యుదాహరణల నిచ్చియుంటిని, ఇంక నవ్వారిరచనలం దొక్కండిటను నుదాహరించుచున్నాను చూ॥

## కూర్మ పురాణస్థిత శ్రీకృష్ణ కృత శివస్తుతి

శ్లో॥ ఓం నమో నీలకంఠాయ త్రినేత్రాయ చరంహసే,
మహాదేవాయ తే నిత్య మీశానాయ నమోనమః. ౧.

,, నమః పినాకినే తుభ్యం నమోదండాయ ముండినే,
నమస్తే వజ్రహస్తాయ దిగ్వస్త్రాయ కపర్దినే. ౨.

,, నమో భైరవనాథాయ హరాయచ నిషంగిణౌ,
నాగా యజ్ఞోపవీతాయ నమస్తే వహ్నితేజసే. 3.

,, నమోస్తుతే గిరీశాయ స్వాహాకారాయతే నమః,
నమో ముక్తాట్టహాసాయ భీమాయచ నమోనమః. ౪.

,, నమస్తే కామనాశాయ నమః కాల ప్రమాథినే,
నమో భైరవరూపాయ కాలరూపాయ దంష్ట్రిణే. ౫.

,, నమోస్తుతే త్ర్యంబకాయ నమస్తే కృత్తివాసినే,
నమోంబికా పతయే పశూనాం పతయేనమః. ౬.

,, నమస్తే వ్యోమకేశాయ వ్యోమాధి పతయేనమః,
నరనారీ శరీరాయ సాంఖ్యయోగ ప్రవర్తినే. ౭.

నమో దైవత నాథాయ నమో దైవత లింగినే,
కుమార గురవే తుభ్యం దేవ దేవాయ తే నమః.

నమో యజ్ఞాధిపతయే నమస్తే బ్రహ్మచారిణే,
మృగవ్యాధాఽధి పతయే బ్రహ్మాధి పతయేనమః.

నమో భవాయ విశ్వాయ మోహనాయ నమోనమః,
యోగినే యోగగమ్యాయ యోగమాయాయ తేనమః. ౧౦.

నమోనమో నమస్తుభ్యం భూయోభూయో నమోనమః
మహ్యం సర్వాత్మనా కామాన్ ప్రయచ్ఛ పరమేశ్వరః ౧౧.

త్రేతాయుగాదినుండి నెలకొనియున్న యీ (పాతూరు) మహాస్థలంబున నీ మల్లేశ్వరాలయము దక్క * మఱియొక దేవాలయంబింత దనుక లేకుండుటలోఁ గూడ నొకగొప్ప మాహాత్మ్యంబీ క్షేత్రంబునకున్నట్లు గోచరింపకపోదు "శివాయ విష్ణురూపాయ, శివరూపాయ, విష్ణవే" అను నను శ్రుతి యిచ్చటనే సార్థకంబగు చున్నది. కావుననే సర్వమత, కుల వివక్షత లేకుండ ఏకోన్ముఖత ఏకోపాసనంబున కిచ్చోటు జగజ్జేగీయ యశోవిరాజ మానంబుగ బ్రకాశింప గల్గుచున్నది. ఇంక నిచ్చోటగల పవిత్రోదకముం గూర్చి వ్రాయుచున్నాను.

N. B :- * నేఁడుమాత్రము శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి దివ్యాలయము పాతూరుక్రొత్తూరులకు మధ్యమహోన్నతముగ వెలసియున్నది.

## పెద్దఘంట, పెద్దనంది.

శ్రీ మల్లేశ్వరాలయ ముఖ ద్వారంబునకు ముందు క్రొత్తగా యాత్రికులచే నిర్మింపబడిన మండపమున నొక పెద్ద ఘంట వ్రేలాడగట్టంబడి యున్నది. దీనియందుగలుగు నోంకారధ్వని సుమారొక మైలుదూరంబు వఱకైన వినపడంగలదు. మఱియు నినుప కటకటాలలో నొక పెద్దనందియు గల్గియున్నది. ఈ నందికి ధ్వజస్తంభమునకు మధ్యనొక చిన్ననంది గల్గిన నిలువెత్తు నలుచదరపు శిలాస్తంభంబు పాతిపెట్టంబడి యున్నది. ఈశిలాస్థంభమునందే శ్రీ వెంకటరత్న శ్రేష్ఠిగారి ధర్మశాసనములు చెక్కంబడియున్నవి. కావున చూడుడా శాసనంబులు.

## దక్షిణపువైపునంగల శాసనము

"పూర్వభాగంబున శ్రీ చిట్టరసు మంత్రిచే బూర్వ ప్రతిష్ఠితమైన శిధిల శివాలయమును నూతన నిర్మాణంబు గావించి గోపురంబు లెత్తించి, ధ్వజస్తంభంబు వేయించి శ్రీ భ్రమరాంబా మల్లేశ్వర, భద్రకాళీ ప్రతిష్ఠలుచేయించి, అంగరంగ వైభోగములకు వృత్తులు కల్పించి వేయించిన ధర్మ శాసనము ఏతద్గ్రామ నివాసియు వైశ్యకులరత్నమును ప్రభాస గోత్రోద్భవుండును గొడవర్తి వంశపయః పారావార రాకా సుధాకరుండును, బాపయాఖ్యుని పుత్త్రుండును శ్రీ భ్రమరాంబ మల్లేశ్వర భద్రకాళీ ప్రతిష్ఠకులైన కొల్లిపర వేంకట రత్నముగారి జామాతయును అగు రాధాకృష్ణ యాఖ్యుల

ధర్మపత్ని పిచ్చమాంబా సమేతులై దేవతాలయములో శ్రీ గణపతి ప్రతిష్ఠగావించిరి. మంగళమ్ మహాత్. శ్లో॥ స్వదత్తాది గుణంపుణ్యాం పరదత్తాను పాలనం । పరదత్తాపహారేణ స్వదత్తంనిష్ఫలం భవేత్॥ బహుభిర్వసుధాదత్తా బహుభిశ్చాను పాలితా । యస్యయస్యయదాభూమి స్తస్యతస్య తదాఫలం ॥ శ్రీ భ్రమరాంబా మల్లేశ్వరాది దేవతలకిచ్చిన వృత్తులు ఈ దేవతలకు బూర్వమునుండి సాగివచ్చుచున్నభూమి గుంటూరు తాలూకా పెదకాకాని గ్రామములో పట్టానంబరు ౬౩౬ డివిజన్ నంబరు ౪౮-౨ గల ఎ ౧౧-౩౮ శెంట్లు మెరకయినాముస్ను ఈ యాలయమును ప్రతిష్ఠించిన కొల్లిపర వెంకటరత్నము గారిచే గుంటూరుతాలూకా "చేకూరు" గ్రామములో మెరకయినాము ౧౮ యకరములు"

"This temple is contructed by
Kollipara Venkataratnam"

## పెద్దనందివైపునంగల శాసనము

"స్వస్తిశ్రీ కలియుగ గతాబ్దంబులు ౫౦౧౧ ను శ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౮౩౨ ను హూణశక వత్సరంబులు ౧౯౧౧ అగు నేటి సాధారణనామ సంవత్సర ఫాల్గుణ బహుళ పాడ్యమి బుధవారము పగలు పది

N. B. :- శ్రీ వెంకటరత్న శ్రేష్ఠిగారు దేవుని కర్పించిన ౧౮ యకరముల భూమి పరాధీనంబగుటయు, శ్రీ చింతమనేని అంజయ్యగారు ఎగ్జిక్యూటివు ఆఫీసరుగా నున్నప్పుడు O. S. 72/49 దావావేసి గెలుపొందుటయు నేడాభూమి మాగాణియైనందున సం 1కి రాబడిరు. 4000 నాల్గువేలుండుననియుతెలియంగలదు.

గడియలవేళ ఉత్తరా ఫల్గునీ నక్షత్రయుక్తి వృషభలగ్న పుష్కరాంశంబున గుంటూరు మండలము నందలి కొండవీటి సీమలోని పెదకాకాని పురంబునందు ఏతద్గ్రామ వాస్తవ్యులును కొల్లిపరవంశాబ్ధి చంద్రులును, మార్కండేయ సగోత్ర పవిత్రులును, వైశ్యకులోత్తములును, కోటయాఖ్యుని పుత్రులును, రామయాఖ్యుని పౌత్రులును, యెల్లమందగారి యనుజులును, రామస్వామిగారి యగ్రజులును అగు వెంకటరత్నముగారు తద్ధర్మపత్ని వెంకమాంబ సమేతులై నాగేంద్రము, రామకోటయ్య, రామస్వామి, మల్లికార్జున నామకసుతు" (తక్కుంగల అక్షరములు కట్టడములో నిమిడిపోయి యున్నవి.

## అగ్గనాలభావి పవిత్రత

స్వామి ప్రాంగణద్వారమునకు వెలుపలగల విశాల స్థలంబున నుత్తర దక్షిణ దిశలందు ఆలయసంబంధ కొట్లు వరుసలుగానున్నవి. వీటిని అద్దెకు ప్రతిసంవత్సరము పబ్లికు వేలము పెట్టియిచ్చుటగలదు. నారికేళ, కదళీఫలాదు లందువిక్రయింపంబడుచున్నవి. రోడ్డు నానుకొనియున్నయొక బొడ్డు భావికి "అగ్గనాలభావి" యని పేరు. ఈ పేరు యిందలి జలపవిత్రతనుగూర్చి అగ్గలముగానుంటచే గలిగియుండ నోపునని తలంచుచున్నాను. ఈ క్షేత్రావరణము కడు విశాలంబగుటచే నందందుంగల విశేషములంగూర్చి ఇంక చూచి వెదకు.

## శ్రీ వీరబ్రహ్మేంద్రాలయము

శ్రీ మల్లేశ్వరాలయమునకు యాత్రికులు వచ్చునప్పుడు గాని, స్వామిని సేవించి వెళ్లినప్పుడు గాని రోడ్డునకు దక్షిణదిశ యందు గనంబడు శ్రీ వీరబ్రహ్మేంద్రాలయంబు వేంచేసి కదలీఫల,నారికేళాదులను సమర్పించి, విభూతిం ధరించి, కుంకుమ నొసట నుంచుకొని, ఘంటమ్రోగించి, ప్రణుతులిడి, కర్పూర నీరాంజనంబు కనులకు నద్దుకొని, తీర్థ ప్రసాదంబులం గృతార్థులగుచుండుటగలదు కావున నీ స్వామిం గూర్చి యొక మంగళ శ్లోకంబు నుదాహరించుచున్నాను,

శ్లో॥ శ్రీ వేదాంత వికాసధామ నిధయే నిత్యాత్మనే మంగళమ్,
సంసారార్ణవ మగ్నతాపహరయే నిత్యాత్మనే మంగళమ్,
కాలజ్ఞాన విలేఖకాయమునయే బ్రహ్మాత్మనే మంగళమ్,
వీరబ్రహ్మ విరాట్ స్వరూపగురవే చిన్మూర్తయే మంగళమ్.

## సోదెలగుడులు

బ్రహ్మముగారి గుడినుండి పడమర హైరోడ్డుకలియు చోటుకు వెళ్ళగా నట నిరుపార్శ్వంబుల పూజ్య యాదవ దంపతుల పేరిటగల రెండు గుడులందును సోదెలు చెప్పువారుందురు. వారు చెప్పు సోదెలయందలి ప్రయోజనంబును అనుభవనీయులు చెప్పదగిన దగుట యిట బ్రిస్థరింపలేదు

## శ్రీ గోపాలస్వామి గుడి

గ్రామమధ్యంబున రోడ్డునకు పడమరగ శ్రీ గోపాలస్వామిగుడి గల్గియున్నది. ఈ గుడికిముందు రోడ్డుకు తూర్పున

పూర్వము చిట్టరసుమంత్రి ప్రతిష్ఠించిన వీరభద్రేశ్వర దేవాలయము గలదనియు, ఆ దేవళము పూర్తిగా శిథిలమైపోయి నందున నా మూల విరాట్ మూర్తి మాత్రము లభించుటచే దానిని ప్రస్తుతము మల్లేశ్వరస్వామిగుడి ప్రహారీగోడకు సమర్పింపంజేసి యుండిరనియు కొందరు తెలిసినవారు చెప్పుచున్నారు.

## రెంటూరి చిట్టరసుమంత్రి శాసనము

ఈ ప్రాచీన శాసనంబులు సేకరణ శ్రీ కొడాలి వెంకట రత్నంచౌదరి (అడ్వొకేటు గుంటూరు) గారివలన గల్గుటచే శ్రీవారికెంతయు కృతజ్ఞతందెలుపుచు ముఖ్యముగ నీపెదకాకాని మల్లేశ్వర స్వామింగూర్చిన సందర్భము గలంతవరకు నిట నుదాహరించుచున్నాను. * ఇది 1 మొదలు 129వం క్తులుకు పైగ గల్గియున్నది. గాన నటులనె నంబరువారిగ విషయ సంగ్రహణ మొనర్చుదుముగాక.

" No. 702 (A. R. No. 251 of 1892) on apilar in front. of the Virabhadra Temple at the same Village First face-1

" (1) అంగడి వీరభద్రాయనమః [|*] ధ్యానం [|*] (2) చర్మాంసిశం భుజగం గదాపి చ మహాశక్తి- (3) ంచఖట్వాంగకం చాపం - చాతశిలీము (4) ఖంచపరశుం శూలం తథానః కరైః|త్రి (5) యశ్చంద్ర కళాకలాపరుచిరం నీ (6)

లాంబుద శ్యామలం [1] పాయాద్వి (7) శ్వమిదం ప్రసన్న వదనం శ్రీ వీర (8) భద్రంభజే॥ స్వస్తి శ్రీ జయాభ్యుద (9)య శాలివాహనశకవర్షంబులు (10) ౧౪౪౦అగునేంటి॥స్వస్తిశ్రీ మచ్ఛకా (11) బ్ధేఖజలధిమనుగే శ్రావణేబాహు (12) ధాన్యేపం చమ్యాంకృష్ణపక్షేకుము (13) ధసఖదినే రాజ కా కాండిపుర్యాం రె(14)ంటూరిచిట్టమంత్రీనరమతికరో (15) ద్వీరభద్రప్రతిష్ఠాం"
(సౌత్ ఇం॥శా॥4వ భాగం 222)

" (99) కాకాండినిఅంగడిపిరేశ్వరుని౹న్ని భ(100)ద్రకా ళింన్ని౹ప్రిమభేశ్వరునింనిం జేయించి (101) ప్రతిష్టలుచేసి (105) "అంగరంగవైభవా (106) లునుసాగించికృష్ణదేవమహారాయల (107) చేత వెలిగండ్లుఅని౹గ్రామముయిప్పించి" (సౌ...124పు)
"చెనమల్లికార్జునలిం (126) గంకోటేశ్వరలింగంకీర్తిగోపీనాథ ని౹గ్రామఆజ్ఞే(107)యానక్రిష్ణమరాజుమల్లయ్యంగారుగట్టించి న(128) చెఱువుకిందనుఛరిమడిఖ౧గ్రామముతూ (129) ర్పునను చెనమల్లికార్జునలింగంకంఖం౹౹" (సౌ॥ఇం॥శా॥4వభా॥225వపుట)
(172) వీరేశ్వరుని దేవళంసేసినకాశ (173) వారు౹దరణికోటబసు వాభక్తుం(174)డు౹గడ్డమడుగుబసువాభక్తుం (105) వడ్లబసువా భక్తుండు౹నందిపో(176)తాభక్తుండుకాకాండిఅంమెన౹(177)వీర కిగోళ్ళమూండిపాలిమేరమెట్టను (178) క్షేత్రంఖం" (సౌత్ ఇండియన్ శా॥4వభా॥ 226)

South-Indian inscriptions (Texts) Volume iv

ఈ శాసన 1వ పంక్తి "అంగడి వీరభద్ర" 99వ పంక్తి "అంగడి వీరేశ్వర" అని శ్రీ వీరభద్రస్వామినింగూర్చి లిఖింపం బడెను. గాన 172వ పంక్తిలోని "వీరేశ్వర దేవళం" అనునది "వీరభద్ర దేవళం" బనుటం గూర్చిన దేకాని వేఱుకా నేరదు.

ఇందువలన శ్రీకృష్ణదేవరాయ లిచ్చుటకి రాకపూర్వ మెంతకాలముక్రిందట నుండియో నీ కాకాని మల్లేశ్వరస్వామి "మల్లికార్జునలింగ" నామంబుసంజెన్నుమీరి స్వయంభూలింగ ప్రభావముతో మిక్కిలి ప్రకాసించుచుండెననియు, భక్తితోలంది యీ స్వామి కైంకర్యాభి వృద్ధికి చిట్టరసుమంత్రి కొంత భూఖండంబర్పించి యున్నట్లును తెలియం గల్గుచున్నది.

# సంగ్రహ సుశ్లోక మల్లేశ్వర స్థల పురాణం

శ్లో॥ త్రేతాయాం దండకారణ్యే స్థితం కృష్ణానదీ తటే,
శ్రీ మల్లేశ్వర సుక్షేత్రం కాకాసుర ప్రతిష్ఠితమ్.

శ్రీ మల్లేశ్వరక్షేత్రము త్రేతాయుగంబున కృష్ణానదీతీర ప్రాంతంబగుదలి దండకాటవి యందుండెను. కాకాసురుండను శైవభక్తుండిద్దానిం బ్రతిష్ఠించెను.

శ్లో॥ శివలింగార్చనం కృత్వా శ్రీరామః కృష్ణఫల్గునౌ,
అప్రాప్నువన్మహా భక్త్యా దివ్యాస్త్రాణి మహా న్వితై.

శ్రీరామచంద్రసార్వభౌముఁడు, శ్రీకృష్ణభగవానుఁడు, అర్జునుఁడు మహాభక్తితో నీ పరమ శివారాధనం బొనరించి దివ్యాస్త్రములను పొందగల్గిరి.

శ్లో॥ శ్రీ చిట్టమంత్రి ప్రభు కృష్ణరాయః, మల్లేశలింగోన్నతి భూప్రదానం,
భక్త్యాఽకరోత్తస్యపునః ప్రతిష్ఠాం, వైశ్యోత్తమో వేంకటరత్నశ్రేష్ఠీ.

శ్రీ చిట్టన్నమంత్రీ; శ్రీకృష్ణదేవరాయులు శ్రీ మల్లేశ్వర స్వామికైంకర్యాభివృద్ధికి కొంత భూఖండము నర్పించిరి భక్తి ప్రపత్తితో వైశ్యోత్తములగు వెంకటరత్న శ్రేష్టిగారు పునః ప్రతిష్ఠ గావించిరి.

శ్లో॥ మల్లేశ్వర మహాక్షేత్ర మాహాత్మ్య గ్రంథరాజకం,
కృతంచ దేశభక్తేన శ్రీ సుబ్రహ్మణ్యశర్మణా.

శ్రీమల్లేశ్వరక్షేత్ర మాహాత్మ్యంబను నీ గ్రంథరాజము దేశభక్త సుబ్రహ్మణ్య శర్మచే రచింపబడెను.

శ్లో॥ శివస్థల పురాణంతు సర్వభక్తార్తి భంజనం,
సర్వపాప హరంచైవ సర్వకామ్యార్థ సిద్ధిదం.

ఈ శివస్థల పురాణము సర్వభక్తుల యొక్క బాధలను పోగొట్టగల్గినది, సర్వపాతకములను హరింపంజేయ గల్గినది, మఱియు సర్వ కామ్యార్థంబులను ప్రసాదింపంగల్గినది యని యెఱుంగనగును.

గద్య

ఇది : శ్రీ విశ్వజ్ఞ గోత్రపవిత్ర వోలేటి వంశార్ణవ కుముదమిత్ర
నాగాచార్య నాగమాంబా తృతీయపుత్ర
"దేశహిక ప్రదీపిక" విజయధ్వజి ఇత్యాది బహుగ్రంథకర్త
దేశభక్త బిరుద విబ్రాజమాన మాననీయ
బుధజన విధేయ సుబ్రహ్మణ్యశర్మా భిధేయ విరచిత
శ్రీ కాకాని మల్లేశ్వరక్షేత్ర మాహాత్మ్యంబను మహా
స్థల పురాణము సర్వము
సంపూర్ణము.

# పరిచయము - పండితాభిప్రాయము

"శ్రీ సుదర్శన సూర్యోదయము" "హరిపాద చంద్రోదయము" "ఆయుర్వేద మంజూష" శ్రీశైల, సింహాచల, విజయవాటిక, శ్రీ కనకదుర్గ క్షేత్ర మాహాత్మ్యాది బహు గ్రంథకర్తలును, "ఆగమత్రయాచార్యులు"ను; అష్టభాషాచక్రవర్తులును, అష్టావధానులునగు, ఉ॥వే॥ శ్రీ మాన్ "కవిరాజ శిరోమణి" పండిత, దీవి నరసింహాచార్యులవారి అభిప్రాయము.

విజయవాడ రాజరాజేశ్వరీపేట వాస్తవ్యులు, విశ్వకర్మ వంశోద్భవులు, పండితకవులు, బ్రహ్మశ్రీ దేశభక్త నోలేటి సుబ్రహ్మణ్యశర్మగారు రెండుగుళుచ్ఛములుగ "శ్రీ కాకాని మల్లేశ్వర క్షేత్రమాహాత్మ్యము" రచించి తమ "దేశహిత గ్రంథ మాల"లో ద్వాదశ కుసుమముగ ప్రచురించు టెంతయు ప్రశంస నీయము. ఈ గ్రంథమును నేను సమగ్రముముగ చూచితిని. ఇందు వీరుదహరించిన విషయములన్నియు అనేకపురాణముల నుండి చేకూర్చి సప్రమాణముగ వ్రాసిరి. పురాణోద్ధృతవిష యములను పాఠకులకు సులభముగ బోధపడుటకై లలిత, మధుర, గద్య పద్యాదుల ననువదించిరి. మఱియు నిందుసోప పత్తికముగ నిరూపించిన యనేక చరిత్రాంశములు పాఠకులకు నూతన సందేశములైయున్నవి. ఇట్లు పురాణోపలబ్ధాంశము లనేగాక వీరు విమర్శకులగుటచే శాసనములందలి ముఖ్యాంశ ములను చరిత్రావశ్యకములగు వానిని పేర్కొనంగల్గియుండిరి. ఇదివరకు క్షేత్రమాహాత్మ్యములను రచించు కవులందరు కేవ లము సంస్కృత మూలమునకు తెనుఁగు సేయుటయేగాని, క్షేత్రోత్పత్తి, కాలనిర్ణయము పాలించిన ప్రభువులు, కాలాం తరముల కలిగిన మార్పులు మున్నగు అంశములను, నుడువు వాడుకలేదు. కాని యీ గ్రంథకర్త విమర్శకుఁడు కూడ

నగుటచే పైన పేర్కొనిన అనేకవిషయముల నిందు జర్చిం చుచూ పొందుపరిచి, పలువురు పండితుల ప్రశంసలకు పాత్రు లైరి. వీరి రచనయందలి వాక్యక్రమము, ధారాశుద్ధి, తెలుగు నోటికి మృదుమధురమై భావములు హృదయ ముప్పొంగ చేయుచున్నవి. రెండియు వీరు రచించిన "మల్లేశ్వర ప్రభాత స్తోత్రము" గ్రంథాంతమున గ్రంథసంగ్రహశ్లోకములు వీరి యీ రచనకొక నూతనశోభ చేకూర్చినవి. ఈగ్రంథరాజము భక్తులెల్ల రకు నిత్యపఠనీయమైనదనుటలో నెట్టి సందేహమున్ను లేదు. ఈకవిశేఖరుఁడింకను యిట్టి అపూర్వగ్రంథములను పెక్కింటిని రచించి తమ గ్రంథమాలాభిధానము సన్వర్థపరచెదరు గాక యని నేనాశించుచున్నాను.

15-8-1960,
అవనిగడ్డ.

ఇట్లు,
దీవి నరసింహాచార్యుఁడు.

---

"శ్రీ మంగళగిరి క్షేత్ర మాహాత్మ్య" గ్రంథకర్తలును, సుప్రసిద్ధ న్యాయవాదులును, వదాన్యులును నగు శ్రీ కొడాలి వెంకటరత్నంచౌదరి (అడ్వొకేటు, గుంటూరు) గారి అభిప్రాయము.

శ్రీ దేశభక్త వి. యస్. శర్మగారు సుమారు ముప్పదేండ్ల నుండి తమ రచనలద్వార దేశహితసేవ నొనర్పు గల్గుచుండిరి అందునూ వీరు 5, 6 సంవత్సరంబులనుండి శ్రీ పెదకాకాని మల్లేశ్వర సేవానిమగ్నమానస హృదయులై తదాస్థానంబున వసించుచు మనోవాక్కాయ కర్మలయందా దేవునే విశ్వసించి "శివపూజ" "శ్రీ మల్లేశ్వర ప్రభాతస్తోత్రము" మొదలైన రచన

లోనర్చి ప్రచురించుచు నీ "పెదకాకాని మల్లేశ్వర క్షేత్ర మాహాత్మ్యం" బను "స్థలపురాణము"ను కూడ రచించి తన విధ్యుక్త ధర్మమున బ్రచురించుట సంస్తవనీయము. ఇట్టి క్షేత్ర మహాత్మ్యములు మన దేశమున చాలా అవుసరము.

వీరిట్లు తమ పాండిత్య ప్రకర్షచే శాసనాత్మకముగను, చారిత్రాత్మకముగను, పౌరాణికంబుగను నున్న అభేద్యము లగు ననేకాంశంబులను దర్పణంబువలె విపులీకరించుచూ స్వానుభవైక వేద్యములగు నీస్థల మాహాత్మ్యాదులనేకీభ వింపంజేసి; అస్మదాదులవలన శాంతముగ, సాంతముగ, కడుం గడు ఓర్పుతో నెన్నియో విషయంబులను గ్రహించి మృదు మధుర పదగుంభనతో భావనాపటిమనప్పద్య, గద్య, శ్లోకాదుల నుల్లేంఖించి పదంపడి పండిత, పామర భక్త ప్రజానీకంబునకు సుగ మంబగు శైలి నీ గ్రంథరాజమును బ్రచురించుట చాలా ప్రశంసనీయము.

ఇట్టి దైవసేవాతత్పరతగల పవిత్రగ్రంథముల నెల్లరు పఠించి కృతార్థులగుదురుగాక యని నేను తలంచుచున్నాను. మహో త్తమ గుణశాలియు, నిరాడంబర జీవియు, ఆర్థికంబుగ చాల వెనుకంబడిన యీ పండిత (శ్రీ) గ్రంథకర్తగారి కృషిసఫలీకృ తంబగుగాక యని నే నాకాంక్షించుచున్నాను. ఈ గ్రంథము అనేకముద్రణలు జరుగగలదని నానమ్మకము.

17-8-1960,<br>గుంటూరు.

ఇట్లు,

కొడాలి వెంకటరత్నముచౌదరి.

బ్రహ్మశ్రీ వానపాముల రత్తయ్య బి. ఎ; ఎక్స్ ఎకౌంట్సు ఆఫీసరు, శ్రీ వేంకటేశ్వర తిరుమల తిరుపతి దేవస్థానం; (తిరుపతి) అసిస్టెంటుఎగ్జామినరు ఆఫ్ లోకల్ ఫండు ఎకౌంట్సు (విజయవాడ)ఆఫీసరు గారి అభిప్రాయము.

హైందవదేశంబున దివ్యక్షేత్రంబు లసంఖ్యాకంబు లనుట అతిశయోక్తికాదు. అందు ఇంచుమించు తిరుపతివలె అభ్యున్నతిం బ్రకాశించుచున్నది శ్రీ పెదకాకాని దివ్యస్థలము. ఈస్థలచరిత్రను శ్రీ దేశభక్త వోలేటి సుబ్రహ్మణ్య శర్మగారు రచించుట సువర్ణమునకు సువాసనయబ్బినట్లైనది.

ఈక్షేత్రోత్పత్తి బహు ప్రాచీనమనియు, చిట్టరసుమంత్రి నాంటికిం బూర్వము త్రేతాయుగాదినుండి గల్గియున్నట్లు ఋజువుపరచుటకై శ్రీ శర్మగారొనర్చిన కృషి శ్లాఘాపాత్రముగ నున్నది. ఇంక వీరిరచనముంగూర్చి నుడువుట జగంబెఱింగిన బ్రహ్మమునకు జందెంబేల యన్నట్లగును. ఉదాహరణంబునకు 49 వ పుటంగల దండకము, 90 వ పుట పంచరత్నములు, గ్రంథాద్యంతంబులంగల స్తోత్ర సంగ్రహ శ్లోకాదులు ఈ కవి యొక్క పాటవముం బాండిత్యముం బరిలలకు వేద్య మొనర్పక పోవు.

ఈ గ్రంథమువలన నీ పెదకాకాని మల్లేశ్వరక్షేత్రము జగద్వ్యాప్తినంది వన్నెవాసింగను నని నే నాశించుచున్నాను.

విజయవాడ,
21-8-1960.

ఇట్లు,
వానపాముల రత్తయ్య బి. ఎ.,
అసిస్టెంటు ఎగ్జామినరు ఆఫ్ లోకల్ ఫండు ఎకౌంట్సు

# శ్రీ పెదకాకాని మల్లేశ్వర దేవస్థానమునకు రాగల మార్గములు

హైదరాబాదు- కాకినాడ- విశాఖపట్టణం వైపులనుండి రాగల వారు విజయవాడ స్టేషను చేరి అటనుండి బస్సులపైనిగాని రైలులోగాని గుంటూరు వెళ్ళుమార్గమున నంబూరు స్టేషనునందు దిగి అటకు 3 మైళ్ళ దూరమునంగల యీ మల్లేశ్వర దేవాలయమునకు సిటీకారులలోగాని రిక్షాలలోగాని, నడిచిగాని సుకరముగా చేరవచ్చును.

మదరాసు- నెల్లూరు వైపులనుండి వచ్చువారు సరాసరి తెనాలి రైల్వేస్టేషనులో దిగి బస్సులలోగాని రైలులోగాని గుంటూరు చేరి అటకు 5 మైళ్ళ దూరములోని యీ పెదకాకాని దేవస్థానమునకు సిటీకారులలోగాని, టైనుబస్సులలోగాని, రిక్షాలలోగాని సులభముగా చేరుకొనవచ్చును. మాచర్ల- కర్నూలు వైపువారు గుంటూరు స్టేషనులోదిగి పై మాదిరిగా పెదకాకాని శ్రీ మల్లెశ్వర దేవస్థానమునకు చేరవలెను.

## సౌకర్యములు.

ఇట దేవస్థానమువారి గొప్ప బిల్డింగు గలదు. దీనిగది 1కి రోజుకు రు 2/- రెండు రూపాయలలెక్కన అద్దె, అడ్వాన్సు ముందే పుచ్చుకొని యాత్రికులకు సరఫరా చేయుచుందురు. మరిన్ని ప్రత్యేకసత్రములు 6, ఆరు ఉన్నవి. వీటియందలి గదులు 3 రోజులవరకుమాత్రమే ఉచితముగ ప్రత్యేక ప్రత్యేకముగా యిచ్చుచున్నారు.

స్నానపానిములకు వలసినన్ని బావులు, పెద్దచెరువు, తటాకము గల్గియున్నది. దేవాలయమునకు నెదుట, ఇరుపార్శ్వములంగల కొట్లలో పూజాద్రవ్యములు, పూలు, పండ్లు, టెంకాయలు, శైవ చిత్రపటములు వగైరాలు సరియైన ధరలకే దొరుకంగలవు. వడుగులు, పెండ్లిండ్లు మొదలగువానికి దేవాలయ ఆఫీసులో రుసుముకట్టి రసీదులు పుచ్చుకొనవలయును. ఇంకను కావలసిన వివరములు ఆలయంబందలి ఆఫీసులోనే తెలిసికొనవచ్చును.





(1) శ్రీ మల్లేశ్వర దేవాలయమునకు ఉత్తరవు వైపుచంగల గోడ పాదవునం బ్రతిష్ఠింపబడి యున్న నాగేశ్వర స్వాములు. పూజాపురస్కార మొనర్చు భక్తులు. (2) ప్రదక్షిణం బొనర్చువారి వలయము నానుకొని తమతమ నియమిత ప్రదక్షిణాలు మల్లేశ్వరస్వామి ఆలయమున కొనర్చి తదుపరి దేవస్థానములోనికి వెళ్ళవలెను. ఆ దృశ్యం బియ్యది.